జ్ఞాని పురుష్ దాదా భగవాన్ నిర్వచించిన

# క్రోధం

క్రోధం అంటే ప్రత్యక్షమైన అగ్ని, మొదట తనను తాను
కాల్చుకుంటాడు, తరవాత ఎదుటి వ్యక్తిని కాల్చేస్తాడు

Telugu

జ్ఞాని పురుష్ దాదా భగవాన్ నిర్వచించిన

# క్రోధం

మూలం - గుజరాతి

సంకలనం - డా. నీరూ బెహన్ అమీన్

తెలుగు అనువాదం - మహాత్మాగణం

**ప్రకాశకులు** : అజీత్ సి.పటేల్
దాదా భగవాన్ విజ్ఞాన్ ఫౌండేషన్
1, వరుణ్ అపార్ట్‌మెంట్, 37,శ్రీమాలి సొసైటీ
నవరంగ్‌పురా పోలీస్ స్టేషన్ ఎదురుగా,
నవరంగ్‌పురా, అహ్మదాబాద్ – 380009
గుజరాత్, భారత్
**ఫోన్:** + 91 79 3500 2100



**First Edition** : November 2023 (500 copies)

**భావ మూల్యం** : 'పరమ వినయం', మరియు "నాకు ఎంతమాత్రం తెలియదు. అదే భావన

**Price** : Rs. 30

**ముద్రిక** : అంబా మల్టి ప్రింటింగ్
B–99, ఈఎల్క్ట్రానిక్స్ GIDC
క–6, రోడ్డు సెక్టర్–25
గాంధీనగర్ – 382044
గుజరాత్, India
**ఫోన్:** +91 79 3500 2142

ISBN No: 978-93-91375-27-0

**Printed in India**

# త్రిమంత్రం

(సర్వ విఘ్న నివారణ చేసే మంత్రం)





నమో అరిహంతాణం

నమో సిద్ధాణం

నమో ఆయరియాణం

నమో ఉవజ్ఝాయాణం

నమో లోయే సవ్వ సాహూణం

ఏసోపంచణమోక్కారో,

సవ్వాపావప్పణాసణో

మంగళా ణం చ సవ్వేసిం,

పడమం హవయీ మంగళం

ఓం నమో భగవతే వాసుదేవాయ

ఓం నమో శివాయ

జై సచ్చిదానంద





# దాదా భగవాన్ ఎవరు?

జూన్ 1958లో, ఒక సాయంత్రం 6 గంటల సమయంలో, జనసమూహంతో రద్దీగా ఉన్న సూరత్ స్టేషన్‌లోని మూడవ నెంబరు ప్లాట్‌ఫాం బెంచిపైన కూర్చుని ఉన్న అంబాలాల్ మూల్‌జీ భాయ్ పటేల్ యొక్క దేహమందిరంలో సంపూర్ణ రూపంలో 'దాదా భగవాన్' సహజంగా వ్యక్తమయ్యారు! ప్రకృతి ఆధ్యాత్మికత యొక్క అద్భుతమైన ఆశ్చర్యాన్ని వెల్లడించింది! ఒక గంట వ్యవధిలో, ఆయనకి విశ్వదర్శనం అయింది! 'మనం ఎవరం? దేవుడు ఎవరు? ప్రపంచాన్ని ఎవరు నడుపుతారు? కర్మ ఏమిటి? విముక్తి అంటే ఏమిటి?', వంటి అన్ని ఆధ్యాత్మిక ప్రశ్నల రహస్యాలు బయటపడ్డాయి! ఈ విధంగా ప్రకృతి, విశ్వానికి ఒక అద్వితీయమైన పూర్తి దృష్టిని  అందించింది, మరియు దీనికి మాధ్యమం అయ్యారు, శ్రీ అంబాలాల్ మూల్‌జీ భాయ్ పటేల్, గుజరాత్ లోని చరోథర్ యొక్క భాద్రన్ గ్రామంలోని పాటీదారు, కాంట్రాక్టర్ వ్యాపారం చేస్తున్నప్పటికీ, పూర్ణ  వితరాగ పురుషుడు!

'వ్యాపారంలో ధర్మం ఉండొచ్చు కానీ ధర్మంలో వ్యాపారం ఉండకూడదు' అనే సిద్ధాంతంతో ఆయన జీవితం అంతా గడిపారు. జీవితంలో ఎప్పుడూ కూడా ఆయన ఎవరి దగ్గరా డబ్బులు తీసుకోలేదు. అంతే కాకుండా వ్యాపారంలో సంపాదించిన దానితో భక్తులను యాత్రకు తీసుకొని వెళ్లేవారు.

ఆయనకు ప్రాప్తమైన విధంగానే కేవలం రెండు ఘంటలలో, వేరేవారికి కూడా జ్ఞాన ప్రాప్తి కలిగించే శక్తిని పొందారు! దీన్నే అక్రమ్ మార్గంగా అభివర్ణించారు. అక్రమ్ అంటే క్రమం లేకుండా, మరియు క్రమ్ అంటే ఒక్కో మెట్టు పైకి ఎదగడం! అక్రమ్ అంటే స్టెప్-లెస్, షార్ట్‌కట్, ఎలివేటర్ మార్గం!

ఆయన స్వయంగా ప్రతి ఒక్కరికి 'దాదా భగ్వాన్ ఎవరు?' అనే దానిని వివరిస్తూ ఇలా అనేవారు, "నీ ముందు కనిపించేవాడు దాదా భగవాన్ కాదు. ఇక్కడ కనిపించేది 'ఏ. ఎం. పటేల్'. నేను జ్ఞాని పురుషుడను మరియు లోపల ప్రకటించింది దాదా భగవాన్. దాదా భగవాన్ పద్నాలుగు లోకాల నాథుడు, అతను మీలో మరియు ప్రతి ఒక్కరిలో కూడా ఉన్నాడు. మీలో అవ్యక్త రూపంలో ఉన్నాడు, మరియు 'ఇక్కడ' సంపూర్ణ రూపంలో వ్యక్తమయ్యాడు! నేను భగవన్తుడిని కాను. నా లోపల వ్యక్తమైన దాదా భగవాన్ని నేను కూడా నమస్కరిస్తాను."



# అనువాదకుని విజ్ఞప్తి

అంబాలాల్ ఎమ్. పటేల్ నామధేయులైన జ్ఞానిపురుషుడిని దాదాశ్రీ, లేక దాదా లేక దాదాజీగా భక్తులందరూ పిలుస్తారు. ఆత్మ విజ్ఞాన సంబంధమైన మరియు ప్రపంచ వ్యవహార జ్ఞాన సంబంధమైన తన సత్సంగాన్ని యధాతథంగా అనువదించటం సాధ్యం కాదని ఆయన తరచూ చెప్పేవారు. అనువాద క్రమంలో లోతైన, సహేతుకమైన అర్థం ముముక్షువులకు అందకపోవచ్చు అని కూడా దాదాశ్రీ చెప్పేవారు. గుజరాతీ భాషని నేర్చుకోవటంలోని ప్రాముఖ్యతను ఆయన నొక్కి వక్కాణించేవారు. తద్వారానే దాదాశ్రీ అమూల్యమైన బోధల సంపూర్ణ సారాన్ని యధాతథంగా గ్రహించే అవకాశం ఉంటుందని దాదా మాటల సారాంశం.

అయినప్పటికీ దాదాశ్రీ తన బోధలను ఇతర భాషలలోకి అనువదించటానికి, తద్వారా ప్రపంచంలోని యావత్తు ప్రజానీకానికి అందించటానికి తమ ఆశీర్వాదాన్ని అనుగ్రహించారు. తనలో ప్రకటితమైన ఈ అక్రమ విజ్ఞానాన్ని ప్రపంచంలోని మానవాళి పొంది తమ బాధలనుంచి విముక్తి పొందాలని, జీవన్ముక్తిని అనుభవించాలని దాదాజీ యొక్క ప్రగాఢమైన వాంఛ. ఈ విజ్ఞానం యొక్క అద్భుతమైన శక్తులను ప్రపంచం గుర్తించి ప్రణమిల్లే రోజు వస్తుందని కూడా దాదాజీ చెప్పారు.

జ్ఞానిపురుషులైన దాదాశ్రీ బోధలను తెలుగుభాష ద్వారా తెలుగు ప్రజలకు అందించటం కోసం చేసిన చిన్న ప్రయత్న ఫలమే ఈ పుస్తకం యొక్క అనువాదం. యధాతథంగా అందించలేకపోయినా సత్సంగ సందేశాన్ని, భావాన్ని ఎటువంటి చెఱుపు లేకుండా అందించడం కోసం ఎంతో శ్రద్ధ వహించటం జరిగింది.

అనంతమైన దాదాజీ జ్ఞాన ఖజానాకి ఇది ప్రాథమిక పరిచయం మాత్రమే. ఈ అనువాదంలో ఏమైన తప్పులు దొర్లివుంటే అవి పూర్తిగా అనువాదకులవే అని గమనించగలరు. వాటి నిమిత్తమై మేము మీ క్షమను అర్థిస్తున్నాము.



# తొలి పలుకు

క్రోధమనేది ఒక బలహీనత, కాని ప్రజలు దానిని సౌర్యం అని అనుకుంటారు. క్రోధం చేసే వారి కంటే క్రోధం చేయని వారి యొక్క ప్రభావం వేరే విధంగా ఉంటుంది!

సాధారణంగా, మనం అనుకున్నట్లు జరగనప్పుడు, ఎదుటి వారు మనం చెప్పేది అర్ధం చేసుకోనప్పుడు, డిఫరెన్స్ అఫ్ వ్యూ పాయింట్ అయినప్పుడు, క్రోధం వస్తుంది. అప్పుడప్పుడు మనం కరెక్ట్ అయినా సరే ఎవరైనా మనల్ని తప్పు అని నిరూపించినప్పుడు క్రోధం వస్తుంది. కాని మనది నిజం అనేది మన దృష్టి బిందు నుంచే కదా? ఎదుటి వారు కూడా తమ దృష్టి బిందు నుంచి వారే కరెక్ట్ అని నమ్ముతారు, కదా! చాలా సార్లు మనకి అంతర్దృష్టి లేనప్పుడు ముందు ఏం ఉందో కనిపించక పోవడం వల్ల, ఏమి చేయాలో అర్ధం కాదు. అప్పుడు క్రోధం వస్తుంది.

ఎవరైనా అవమానించినప్పుడు క్రోధం వస్తుంది. నష్టం వచ్చినప్పుడు క్రోధం వస్తుంది. ఈ విధంగా మానాన్ని, లోభాన్ని రక్షించడానికి క్రోధం జరుగుతుంది. అలాంటి సమయాల్లో మానం మరియు క్రోధం అనే కాషాయాల నుంచి బయటకి వచ్చే జాగృతి ఉండాలి. పనివాడి చేతిలో నుంచి చాయ్ కప్పు పడి విరిగిపోతే క్రోధం చేసుకుంటాము, కాని అదే, అల్లుడు గారి చేతి నుంచి పడి విరిగితే, అప్పుడు? అక్కడ క్రోధం ఎలా కంట్రోల్ లో ఉంటుంది! దీని అర్ధం, మన బిలీఫ్ పైనే ఆధార పడి ఉందనే కదా?

ఎవరైనా మనకి నష్టం కలిగించినా, మనల్ని అవమానించినా, అది మన కర్మ ఫలమే. ఎదుటి వ్యక్తి నిమిత్ మాత్రమే. ఇలాంటి అవగాహన ఫిట్ అవుతే, క్రోధం వెళ్ళిపోతుంది.

ఎక్కడెక్కడ మరియు ఎప్పుడెప్పుడు క్రోధం వస్తుందో, అప్పుడు వాటిని నోట్ చేసి ఉంచాలి మరియు వాటి మీద జాగృతి ఉంచాలి. మరియు మన క్రోధం వల్ల ఎవరికైతే బాధ కలిగిందో, వాటికి ప్రతిక్రమణ్ చేయాలి, పశ్చాతాపం చేయాలి మరియు ఇంకెప్పుడు ఇలా చేయనని దృఢంగా నిశ్చయించాలి. ఎందుకంటే ఎవరి మీదయితే క్రోధం జరుగుతుందో, వారికి దుఃఖం కలుగుతుంది, అప్పుడు వారు పగ పట్టుకుంటారు, మరియు వచ్చే జన్మ లో మళ్ళీ కలుస్తారు!

తల్లిదండ్రులు తమ పిల్లల పైన మరియు గురువు తమ శిష్యుల పైన క్రోధం చేస్తే వారు పుణ్యం కట్టుకుంటారు. ఎందుకంటే దాని వెనకాల ఉద్దేశ్యం ఏంటంటే, వారి మంచి చేయాలని, వారిని మెరుగు పరచాలని. స్వార్థం కోసం చేస్తే పాపం కట్టుకుంటారు. వితరాగుల అవగాహనా లోని ఖచ్చితత్వం చూడండి!

ప్రస్తుత పుస్థకంలో  మనల్ని బాగా సతాయించే బహిరంగ బలహీనత, క్రోధంకి సంబంధించిన అన్ని విషయాలు వివరంగా సంకలనం చేసి ఇక్కడ ప్రచురించబడింది. ఇది తెలివైన పాఠకులకు క్రోధం నుండి విముక్తి పొందేందుకు ఎంతో సహాయకారిగా ఉంటుంది. ఇదే నా అభ్యర్ధన.

**–డా. నీరుబెన్ అమీన్**

దాదా భగవాన్ నిర్వచించిన

# క్రోధం

## ఎవరు ఒప్పుకుంటారు, "నాది తప్పు?"

**ప్రశ్నకర్త:** మనం సరిగ్గా ఉన్నాసరే ఎవరైనా నాతో తప్పు చేస్తే, అప్పుడు లోపల అతని పై క్రోధం వస్తుంది. ఐతే ఈ క్రోధం త్వరగా రాకుండా ఉండాలంటే ఏమి చేయాలి?

**దాదాశ్రీ:** అవును, కానీ మీది నిజం అయినప్పుడు కదా? మీవన్నీ నిజమేనా? మీరు సరిగ్గా ఉన్నారని మీకు తెలిసిందా?

**ప్రశ్నకర్త:** నాకు నా ఆత్మ చెప్తుంది కదా నాది నిజమని.

**దాదాశ్రీ:** మరి మీరే జడ్జి, మీరే వకీలు, మరియు మీరే ఆరోపి ఐతే మీది నిజమే అవుతుంది కదా? మీరు ఎప్పుడు దగాకోరులు అవ్వరు కదా? ఎదుటివారికి కూడా ఇలానే ఉంటుంది, నేను సత్యవంతుడని. మీకు అర్ధమవుతుందా?

## ఇదంతా బలహీనత !

**ప్రశ్నకర్త:** కానీ నా ప్రశ్న ఏంటంటే, అన్యాయం జరిగితే చిరాకు రావడం మంచిదే కదా? మనం ఏదైనా విషయంలో స్పష్టంగా అన్యాయం జరిగిందని చూసినప్పుడు, మనకు వచ్చే ఆవేశం యోగ్యమా?.

**దాదాశ్రీ:** అదేంటంటే, ఇవన్నీ, క్రోధం మరియు చిరాకు, ఇవన్నీ బలహీనత, కేవలం వీక్నెస్ ఏ. ప్రపంచంలో అందరి దగ్గర ఈ బలహీనత ఉంది.

**దాదాశ్రీ:** నిన్ను ఎవరైనా తిడితే నీకు కోపం వస్తుంది కదా?

**ప్రశ్నకర్త:** అవును, వస్తుంది.

**దాదాశ్రీ:** ఐతే మరి దీనిని బలహీనత అంటారా లేక శక్తి అంటారా?

**ప్రశ్నకర్త:** కానీ కొన్ని సందర్భాలలో క్రోధం రావాల్సిందే!

**దాదాశ్రీ:** లేదు, లేదు. క్రోధం అనేది ఒక బలహీనత. కొన్ని చోట్ల క్రోధం ఉండాలి అనేది ప్రాపంచిక చర్చ. అలా చెప్పే వారు తమ క్రోధాన్ని వదిలించుకో లేక పోతున్నారు కాబట్టి ఇలా చెప్తారు, 'క్రోధం ఉండాలి' అని!

## మనసు కూడా చెడిపోదు, అతనే బలవంతుడు !

**ప్రశ్నకర్త:** మరి ఎవరైనా నన్ను అవమానిస్చినప్పుడు నేను ప్రశాంతంగా కూర్చోని ఉంటే, దానిని బలహీనత అంటారు కదా?

**దాదాశ్రీ:** కాదు. ఓహోహో! అవమానాన్ని సహించడం గొప్ప బలం! ఇప్పుడు నన్ను ఎవరైనా చివాట్లు పెడితే నాకు ఏమి అవ్వదు, అతని గురించి మనసులో కూడా ఏ చెడు ఉండదు, అదే బలం! మరియు బలహీనత అంటే, అందరూ గొడవ పడుతూనే ఉన్నారు కదా, జీవులు అందరు పోరాడుతూనే ఉన్నారు, ఇదంతా బలహీనత అంటారు. అంటే అవమానం ప్రశాంతంగా సహించగలడం గొప్ప బలం మరియు ఇలాంటి అవమానం ఒక్క సారి దాటితే, ఒక్క మెట్టు దాటితే, వంద మెట్లు దాటే శక్తి వస్తుంది. మీకు అర్ధమైంది కదా? ఎదుటివారు బలవంతుడైతే, అతని ముందు ప్రతి ఒక్క జీవి బలహీనమయి పోతారు, అది అందరి స్వాభావిక గుణము. కానీ ఒకవేళ ఎవరైనా బలహీనుడు మనల్ని రెచ్చగొడితే అయినాకూడా అతనిని ఏమి చేయకపోతే, బలవంతుడు అంటారు.

నిజానికి బలహీనులను రక్షించాలి మరియు బలవంతులకు ఎదురు తిరగాలి, కానీ ఈ కలియుగంలో ఇలాంటి మనుష్యులు ఎవరూ లేరు కదా! ఇప్పుడైతే బలహీనులనే తన్నుతూ ఉంటారు, మరియు బలవంతుల నుంచి దూరం పారిపోతారు. కొంత మంది మనుషులు

మాత్రమే బలహీనులను రక్షిస్తారు మరియు బలవంతులకు ఎదురు తిరుగుతారు. ఇలా ఉంటేనే దానిని క్షత్రియ గుణం అంటారు. లేక పోతే, ప్రపంచమంతా బలహీనులనే తన్నుతూ ఉన్నారు, ఇంటికి వెళ్లి భర్త తన భార్య మీద వీరత్వం చూపిస్తాడు. తాడుకు కట్టిన ఆవును కొడితే, అది ఎటు వెళ్తుంది? కానీ దాని కట్టు విప్పి కొడితే? పారిపోతుంది, లేదంటే ఎదురు తిరుగుతుంది.

మనిషి తనకి శక్తి ఉన్నా సరే ఎదుటి వాడిని బాధించకపోతే, అతని శత్రువుని కూడా బాధించకపోతే, అతనినే బలవంతుడు అంటారు. ఇప్పుడు ఎవరైనా మీ మీద క్రోధం చేస్తూ ఉంటే, మీరు కూడా తన మీద కోపగించుకుంటే దీనిని బలహీనత అంటారా లేదా? అంటే నేను ఏం చెప్తున్నానంటే ఈ క్రోధం–మానం–మాయ–లోభం ఇవన్నీ బలహీనతలు. బలవంతుడైతే, అతనికి కోపగించుకునే అవసరమే ఏమి ఉంది? కానీ ఈ క్రోధంలో ఉన్న తాపంతో ఎదుటివారిని తమ వశంలోకి తెచ్చుకోవడానికి ప్రయత్నిస్తారు, కానీ ఎవరికైతే క్రోధం లేదో అతని దగ్గర ఎదో ఉంటుంది కదా? ఇతనికి శీలం అనే చారిత్రం ఏదైతే ఉంటుందో, దానితో జంతువులు కూడా లొంగిపోతాయి. పులి, సింహం, శత్రువులందరు, మొత్తం సైన్యమంతా లొంగిపోతుంది!

## క్రోధితుడు, అతను అబల !

**ప్రశ్నకర్త:** కానీ దాదా, ఎప్పుడైనా ఎవరైనా మన ముందు వేడెక్కితే ఏమి చేయాలి?

**దాదాశ్రీ:** వేడెక్కుతారు కదా మరి! వారి చేతిలో ఏమైనా ఉందా? లోపలి మెషినరీ చేతిలో ఉండదు కదా! అది, ఎదో ఒకటి చేసి మెషినరీ నడుస్తూ ఉంటుంది. తమ చేతిలో ఉంటే మెషినరీ వేడెక్కనివ్వరు కదా! కొంచెం కూడా వేడెక్కిందంటే గాడిద అయ్యినట్లే, మనుషులలో గాడిద అయినట్టే! కానీ ఎవ్వరు ఇలా చేయరు కదా! తమ చేతిలో లేదు, మరి అప్పుడు ఏమి చేస్తారు?

అంటే, ఈ ప్రపంచంలో ఎప్పుడూ వేడెక్కాల్సిన కారణమే లేదు. కొందరు అంటారు, 'ఈ పిల్లవాడు మాట వినడు', అయినా సరే అది కోపిగించుకునే కారణం కాదు, అక్కడ మీరు చల్లగా ఉండి పని చేపించుకోవాలి. కానీ నీవు బలహీనుడవు కాబట్టి వేడెక్కిపోతున్నావు.

మరియు వేడెక్కిపోవడాన్ని భయంకరమైన బలహీనత అంటారు. అంటే, చాలా ఎక్కువ బలహీనత ఉంది కాబట్టే వేడెక్కి పోతారు! అంటే ఎవరైతే వేడెక్కిపోతారో, వారిపై దయ ఉంచాలి, ఈ నిస్సహాయుడికి దీనిలో ఏ కంట్రోల్ లేదు అని. ఎవరికైతే తమ స్వభావము కూడా కంట్రోల్ లో లేదో, అతని పై దయ ఉంచాలి.

వేడెక్కడం అంటే ఏమిటి? అంటే ముందు తానే కాలిపోయి, తరవాత ఎదుటి వారిని కాల్చివేయడం. ఈ అగ్గిపెట్ట కాలిందంటే తాను ముందు బడబడా కాలి, తరవాత ఎదుటి వారిని కాల్చేస్తాడు. అంటే వేడెక్కడం తమ చేతిలో ఉంటే ఎవ్వరు వేడెక్కరు కదా! వేడి ఎవరికి నచ్చుతుంది? కొందరు ఏమంటారంటే, 'ప్రపంచంలో క్రోధించడం అప్పుడప్పు అవసరం ఉంటుంది'. అప్పుడు నేనేమి అంటానంటే, 'లేదు, కోపం తెచ్చుకోవడం అవసరము అనుకునే కారణం ఏమి లేదు' క్రోధం ఒక బలహీనత, అందుకే అది జరిగి పోతుంది. అందుకే భగవంతుడు దీనిని బలహీనత అన్నారు. పురుషుడు అని ఎవరిని అంటారు? క్రోధం-మానం-మాయ-లోభం, ఈ బలహీనతలు ఎవరి దగ్గరైతే ఉండవో, వారినే భగవంతుడు 'పురుషుడు' అన్నారు. అంటే ఈ పురుషులు కనిపిస్తున్నారు కదా, వీరిని కూడా అబల అన్నారు; కానీ వీరికి సిగ్గు ఉండదు కదా, కాబట్టి మంచిది, లేక పొతే అబల అన్నారంటే సిగ్గుపడి పోతారు కదా? కానీ వారికి తెలియదు. ఏమి తెలుసు? స్నానానికి  నీళ్లు పోస్తే స్నానం చేస్తారు. తినటం, స్నానం చేయటం, నిద్రపోవడం, ఇవన్నీ తెలుసు, కానీ వేరే ఏమి తెలియదు. మనుషులకి ప్రత్యేకంగా తెలియాల్సినది ఏదైతే ఉందో, ఇతను సజ్జన పురుషుడు అని, ఇలాంటి సజ్జనత కనిపించాలని తెలియదు.

ఈ క్రోధం-మానం-మాయ-లోభం బహిరంగ బలహీనతలు, మరియు చాలా ఎక్కువ క్రోధం వస్తే కాళ్ళు-చేతులు ఇలా వణకడం చూడలేదా మీరు?

**ప్రశ్నకర్త:** శరీరం కూడా వద్దంటుంది, నీవు క్రోధం చేయవద్దని.

**దాదాశ్రీ:** అవును, శరీరం కూడా వద్దంటుంది, మనకి ఇది శోభనివ్వదని. అంటే క్రోధం ఎంత పెద్ద బలహీనత అంటారు! అందుకే మనకి క్రోధం ఉండకూడదు.

## బలహీనత లేకపోతే ప్రభావం పడుతుంది

**ప్రశ్నకర్త:** ఎవరైనా చిన్న పిల్లవాడిని బాగా కొడుతూ ఉంటే అప్పుడు మనం అక్కడి నుంచి వెళ్తూ ఉంటే, అప్పుడు ఆ వ్యక్తిని ఆపాలి కదా, కానీ అతను వినక పోతే చివరికి అతనిని తిట్టి, కోపగించుకొని, అతనిని పక్కకి తీసుకురావాలా లేదా?

**దాదాశ్రీ:** మీరు కోపగించుకున్నా సరే అతను కొట్టకుండా ఉండడు. అర్రే, మిమల్ని కూడా కొడతాడు కదా! అయినా సరే అతనితో క్రోధం ఎందుకు చేస్తున్నారు? అతనికి నెమ్మదిగా చెప్పండి, వ్యావహారికంగా మాట్లాడండి. లేకపోతె, మీరు కూడా కోపగించుకోవడం వీక్నెస్ ఏ!

**ప్రశ్నకర్త:** ఐతే పిల్లవాడిని కొట్టనివ్వలా?

**దాదాశ్రీ:** లేదు, మీరు అక్కడికి వెళ్లి చెప్పండి, 'మీరు ఎందుకు ఇలా చేస్తున్నారు? ఈ పిల్లవాడు మీకేమి నష్టం చేసాడు?' అలా అతనితో వివరించి మాట్లాడొచ్చు. మీరు అతని మీద కోపగించుకుంటే ఆ కోపం మీ బలహీనత. ముందు మనలో బలహీనత ఉండ కూడదు. ఎవరిలో ఐతే బలహీనత ఉండదో, వారి పర్సనాలిటీ పడుతుంది కదా! అలాంటి వారు ఊరికే, సాధారణంగా చెప్పినా, అందరూ వింటారు.

**ప్రశ్నకర్త:** వినకపోవొచ్చు ఏమో.

**దాదాశ్రీ:** వినకపోవడానికి కారణం ఏమిటి? మీ పర్సనాలిటీ పడదు కాబట్టి. అందుకే, బలహీనత ఉండ కూడదు, చారిత్రవంతుడు అవ్వాలి. మ్యాన్ అఫ్ పర్సనాలిటీ అవ్వాలి! లక్షల మంది గుండాలు అతనిని చూసి పారిపోతారు! అంతే కానీ చిరాకు పడుతున్న మనుషులని చూసి ఎవరూ పారిపోరు, పైగా కొడతారు కూడా! ప్రపంచం బలహీనులనే కొడతారు కదా!

అర్థం, మ్యాన్ అఫ్ పర్సనాలిటీ అవ్వాలి. పర్సనాలిటీ ఎప్పుడు వస్తుంది? విజ్ఞానం తెలుసుకుంటే పర్సనాలిటీ వస్తుంది. ఈ ప్రపంచంలో ఏదైతే మర్చిపోతామో అది (రెలెటివ్) జ్ఞానము, మరియు ఎప్పుడూ కూడా మర్చిపోనిది విజ్ఞానము!

## వేడి కంటే మంచు ప్రభావశాలి !

నీకు తెలుసా, మంచు పడుతుంది! ఇప్పుడు మంచు అంటే చాలా చల్లగా ఉంటుంది కదా? ఆ మంచుతో చెట్లు కాలిపోతాయి, అన్నీ, పత్తి-గడ్డి అన్నీ కాలిపోతాయి. ఇది నీకు తెలుసా? ఇవి చలిలో ఎలా కాలిపోతాయి?

**ప్రశ్నకర్త:** 'ఓవర్ లిమిట్' చలి కారణంగా.

**దాదాశ్రీ:** అవును, అంటే నువ్వు చల్లగా మారిపోతే ఇలాంటి శీలం ఉత్పన్నమవుతుంది.

## ఎక్కడైతే కోపం ఉండదో, అక్కడ ప్రతాపం ఉంటుంది

**ప్రశ్నకర్త:** కానీ దాదా, మితిమీరిన చల్లదనం కూడా ఒక బలహీనత ఏ కదా?

**దాదాశ్రీ:** మితిమీరిన చల్లదనం అవసరం లేదు. మనం లిమిట్లో ఉండాలి, దీనినే 'నార్మాలిటీ' అంటారు. బీలో నార్మల్ ఐస్ ది ఫీవర్, ఎబోవ్ నార్మల్ ఐస్ ది ఫీవర్, నైన్టీ ఎయిట్ ఐస్ ది నార్మల్. కాబట్టి మనకి నార్మాలిటీ ఏ కావాలి.

ప్రజలు కోపిష్ఠుల కంటే కోపం లేని వారినే ఎక్కువ భయపడతారు. దీనికి కారణం ఏమి ఉండవచ్చు? క్రోధం ఆగిపోతే ప్రతాపం ఉత్పన్నమవుతుంది, ఇది ప్రకృతి యొక్క నియమము! లేక పొతే వీరిని రక్షించే వారే దొరకరు కదా! క్రోధం రక్షించేది, అజ్ఞానతలో క్రోధంతో రక్షించుకునే వారు.

## చిరాకు పడే వారి నెంబర్ ఆఖరి

**ప్రశ్నకర్త:** సాత్విక చిరాకు లేదా సాత్విక క్రోధము మంచిదా కదా?

**దాదాశ్రీ:** వీరిని ప్రజలు ఏమి అంటారు? ఈ పిల్లలు కూడా వీరిని ఏమి అంటారంటే, 'ఇతనికి చాలా చిరాకు!' చిరాకు అనేది మూర్ఖత్వం, ఫ్యూలిష్నెస్ ! చిరాకుని బలహీనత అంటారు. పిల్లలను మనం అడిగితే, 'మీ నాన్న ఎలాంటి వారు?' అప్పుడు అతను కూడా

చెప్తాడు, 'ఆయనకి చాలా చిరాకు!' ఇప్పుడు చెప్పండి, పరువు ఉందా, పోయిందా? ఈ వీక్నెస్ ఉండ కూడదు. అర్థం, ఎక్కడైతే సాత్వికత ఉంటుందో, అక్కడ వీక్నెస్ ఉండదు.

ఇంట్లో చిన్న పిల్లలను అడిగితే, 'మీ ఇంట్లో మొదటి నెంబర్ ఎవరిది?' అప్పుడు పిల్లలు కనుగొంటారు, 'మా బామ్మ చిరాకు పడదు, అందుకే అందరి కంటే మంచిది ఈమె, మొదటి నెంబర్ ఈమెకు. తరవాత రెండవ నెంబర్, మూడవది, ఇలా చెప్తూ చెప్తూ నాన్న నంబరు ఆఖరికి వస్తుంది!!! ఎందుకు? ఎందుకంటే ఆయనకు చిరాకు ఎక్కువ. చిరాకు తెచ్చుకుంటారు కాబట్టి. నేను చెప్తాను, 'నాన్న డబ్బు తీసుకొచ్చి మీ కోసం ఖర్చు పెడతారు, అయినా సరే ఆయనకు చివరి నెంబర్ ఆ?' అప్పుడు వీళ్ళు 'అవును' అంటారు. ఇప్పుడు చెప్పండి, కష్టపడి, శ్రమించి, తిండి పెడతారు, డబ్బు తీసుకొచ్చి ఇస్తారు, అయినా సరే చివరి నెంబర్ మీదే వస్తుంది కదా?

## క్రోధం అంటే అంధత్వం !

**ప్రశ్నకర్త:** సాధారణంగా, మనుషులలో క్రోధం వచ్చే ముఖ్య కారణం ఏమి అయిఉండొచ్చు?

**దాదాశ్రీ:** కనిపించడం ఆగిపోతుంది కాబట్టి! మనిషి గోడకు వెళ్లి ఎప్పుడు గుద్దుకుంటాడు? ఎప్పుడైతే అతనికి గోడ కనిపించదో, అప్పుడే గుద్దుకుంటాడు కదా? అలాగే లోపల కనిపించడం ఆగిపోయినప్పుడు మనిషి కోపగించు కుంటాడు.

## అర్థం కానప్పుడు క్రోధం

క్రోధం ఎప్పుడు వస్తుంది? ఎప్పుడైతే దర్శనం ఆగిపోతుందో, అప్పుడు జ్ఞానం ఆగిపోతుంది, అప్పుడు క్రోధం ఉత్పన్నం అవుతుంది. మానం కూడా ఇలానే ఉంటుంది. దర్శనం ఆగిపోతే, జ్ఞానం ఆగిపోతుంది, మరియు మానం ఉత్పన్నమవుతుంది.

**ప్రశ్నకర్త:** ఉదాహరణ ఇచ్చి వివరిస్తే చాలా సులభమవుతుంది.

**దాదాశ్రీ:** కొంత మంది అంటారు కదా, 'ఎందుకు ఇంత కోపగించుకున్నావు?'

అని. అప్పుడు చెప్తారు,' నాకు ఏమి అర్థం కాలేదు కాబట్టి కోపం వచ్చింది'. అవును, ఏమి అర్థం కాకపోతే మనుషులకు కోపం వస్తుంది. ఎవరికైతే అర్థమవుతుందో, వారు కోపగించుకుంటారా? కోపం రావడం అంటే, ఈ కోపం మొదట బహుమతి ఎవరికి ఇస్తుంది? ఎక్కడ మొదలవుతుందో, అక్కడ. ముందు మనల్ని దహించి, తరవాత వేరే వాళ్ళని దహిస్తుంది.

## క్రోధాగ్ని స్వ-పర ని దహిస్తుంది !

క్రోధమంటే తాను స్వయంగా తన ఇంట్లోనే అగ్గిపుల్ల కాల్చడం. తన ఇల్లు గడ్డితో నిండి ఉంటే, దానిపైన అగ్గిపుల్ల కాలిస్తే, దానినే క్రోధం అంటారు. అంటే ముందు తాను కాలి, ఆ తరవాత ఎదుటి వారిని దహిస్తారు.

ఎవరి పొలంలోనైనా పెద్ద-పెద్ద గడ్డి కట్టలు అన్నీ సేకరిస్తే, దానిలో ఒక్కటే అగ్గిపుల్ల పెడితే ఏం అవుతుంది?

**ప్రశ్నకర్త:** కాలిపోతుంది.

**దాదాశ్రీ:** అలాగే ఒక్క సారి క్రోధం వస్తే, అదంతా, రెండు సంవత్సరాలు సంపాదించిందంతా దుమ్ము దులిపేస్తుంది. క్రోధం అంటే వ్యక్తమైన అగ్ని. అతను అంత దుమ్ము దులిపేసాడని అతనికే తెలియదు. ఎందుకంటే బయట వస్తువులు తక్కువ అవ్వవు, కానీ లోపల అంతా నాశనం అయిపోతుంది, వచ్చే జన్మకి అంతా తయారీ ఉంటుంది కదా, దానిలో నుంచి కొంచెం ఖర్చు అయ్యిపోతుంది. మరియు ఎక్కువ ఖర్చు అయిపోతే ఏమవుతుంది? ఇక్కడ మనిషిగా ఉన్నపుడు చపాతీలు తినేవాడు, మళ్ళీ అక్కడ గడ్డి తినడానికి (జంతువులలోకి) వెళ్ళవలసి వస్తుంది. ఈ చపాతీలు వదిలి గడ్డి తినడానికి వెళ్లడం మంచిదేనా?

వరల్డ్ లో ఏ మనిషీ క్రోధాన్ని జేయించలేరు. క్రోధంలో రెండు భాగాలు, ఒకటి కఢాపా (క్రోధస్వభావం) రూపంలో ఉంటుంది మరియు ఇంకోటి అజంప (అశాంతి) రూపంలో. ఎవరైతే క్రోధాన్ని జేయిస్తారో, అది కఢాపా రూపంలో జేయిస్తారు. ఇది ఎలా అంటే, ఒకటి నొక్కి వేస్తే, ఇంకొకటి పెరుగుతుంది, ఇంకా ఏం అంటారంటే, 'నేను క్రోధాన్ని జేయించాను', దీని వల్ల మళ్ళీ మానం పెరుగుతుంది. వాస్తవానికి క్రోధాన్ని సంపూర్ణంగా జయించలేదు. కనిపించే అంత క్రోధాన్ని గెలిచారు అనవచ్చు.

## తంతం, దీని పేరే క్రోధం !

క్రోధంలో తంతం (లింక్, దారం) ఉంటే, దానినే క్రోధం అంటారు. ఉదాహరణకి భార్యా-భర్తలు రాత్రి బాగా గొడవపడి, క్రోధంతో విపరీతంగా మండిపోయి, రాత్రిరంతా ఇద్దరు మేలుకొని ఉన్నారు. పొద్దున భార్య చాయ్ కప్పు తీసుకొచ్చి టేబుల్ మీద కొంచెం కొట్టి పెడితే, భర్తకు అర్థమయ్యి పోతుంది, ఇప్పుడు కూడా తంతం ఉందని! దీని పేరే క్రోధం. ఆ తంతం ఎంత సమయం కోసం ఉన్నా సరే! అర్రే, చాలా మంది జీవితాంతం గుర్తుపెట్టుకుంటారు. తండ్రి తన కొడుకు మొహం చూడడు, మరియు కొడుకు తండ్రి మొహం చూడడు! క్రోధంలోని తంతం మాడిపోయిన మొహం చుస్తే తెలుస్తుంది.

తంతం అంటే ఏంటంటే, ఉదాహరణకి పదిహేను సంవత్సరాల క్రితం నన్ను ఎవరైనా అవమానించాడు. అతను నాకు పదిహేను సంవత్సరాల వరుకు ఎప్పుడూ కలవలేదు. కానీ ఇప్పుడు కలిస్తే, కలవగానే జరిగిందంతా గుర్తొస్తుంది. దీనిని తంతం అంటారు. తంతం ఎవరికీ పోదు. పెద్ద పెద్ద సాధు మహారాజులు కూడా తంతం వారు, రాత్రి మీరు ఏమైనా ఎగతాళి చేస్తే, పదిహేను రోజుల వరకు మీతో మాట్లాడడు. ఇదే తంతం.

## క్రోధం మరియు కోపం లో తేడా !

**ప్రశ్నకర్త:** దాదా, కోపం మరియు క్రోధం లో తేడా ఏంటి?

**దాదాశ్రీ:** క్రోధంలో అహంకారం కూడా ఉంటుంది. కోపం మరియు అహంకారం కలిస్తే క్రోధం అంటారు. కానీ పిల్లవాడిపైన తండ్రి కోప్పడడాన్ని క్రోధం అనరు. ఆ క్రోధంలో అహంకారం ఉండదు కాబట్టి దానిని కోపం అంటారు. అందుకే భగవంతుడు ఏమంటారంటే, 'ఇతను కోపగించుకుంటున్నా సరే ఇతనికి పుణ్యం డిపాజిట్ చేయండి'. అప్పుడు అడుగుతారు, 'ఇతను కోపగించుకుంటున్నాడు, అయినా సరే?, అప్పుడేమంటారంటే, 'లేదు క్రోధం చేస్తే పాపం కానీ కోపంలో పాపం లేదు.' క్రోధంలో అహంకారం కలిసి ఉంటుంది, కానీ మీకు కోపం వస్తే, లోపల మీకు బాధ అనిపిస్తుంది కదా?

## క్రోధం-మానం-మాయ-లోభం రెండు రకాలుగా ఉంటాయి

ఒక రకమైన క్రోధం, మలిస్తే మలపవచ్చు- నివార్య అంటారు. ఎవరిపైనైనా క్రోధం వస్తే, లోలోపలే మలపవచ్చు, మరియు అది శాంతిస్తుంది, ఇది తిప్పితే వెనక్కి తిరిగే క్రోధము. ఈ స్టేజికి చేరుకుంటే వ్యవహారము చాలా అందంగా మారుతుంది!

రెండో రకమైన క్రోధం తిప్పాలనుకున్నా తిరగదు – అనివార్యం. ఎంత ప్రయత్నించినా పటాకా పేలకుండా ఉండదు! అది మార్చలేనటువంటి అనివార్యమైన క్రోధం. ఈ క్రోధం తనకి తానే అపచారం చేస్తుంది, మరియు ఎదుటి వారికి కూడా అపచారం చేస్తుంది!

భగవంతుడు సాధువులు మరియు చారిత్రం గలవారి కోసం ఎంతవరకు క్రోధాన్ని ఒప్పుకున్నారు? ఎప్పటివరకైతే క్రోధం ఎదుటివారికి దుఃఖాన్ని కలిగించదో అంత వరకు క్రోధాన్ని భగవంతుడు ఒప్పుకున్నారు. మన క్రోధం మనకు మాత్రమే దుఃఖాన్ని కలిగిస్తే, వేరే ఎవరికీ దుఃఖం కలిగించక పోతే అంత వరకు క్రోధాన్ని యాక్సెప్ట్ చేసారు.

## తెలిసేది ఎవరికి ?

**ప్రశ్నకర్త:** ఈ క్రోధం వచ్చిందని మనందరికీ తెలుస్తుంది, అయినా సరే...

**దాదాశ్రీ:** ఏంటంటే, క్రోధి ఎవరు, అది తెలియదు, లోభి ఎవరు, అది తెలియదు, మాని ఎవరు, అది కూడా తెలియదు, ఎవరికైతే తెలుసో, వారు వేరు. మరియు అందరి మనసులో ఏం అనిపిస్తుందంటే, నాకు తెలిసినా సరే ఎందుకు వస్తుంది? ఇప్పుడు 'తెలుస్తుంది' ఎవరికి? అది తెలియదు. 'ఎవరికి తెలుస్తుంది' అది తెలియదు. అది మాత్రమే కనిపెట్టాలి. 'తెలుసుకునే వారిని' కనిపెడితే అంతా వెళ్ళిపోతుంది. నిజానికైతే మనకి తెలియదు, తెలిస్తే తప్పకుండ వెళ్ళిపోతుంది, క్రోధం రానే రాదు.

## సమైక్య ఉపాయము, తెలుసుకోండి ఒక్కసారి !

**ప్రశ్నకర్త:** ఇది తెలిసినా సరే క్రోధం వస్తుంది, దీని నివారణ ఏమిటి?

**దాదాశ్రీ:** ఎవరికి తెలుస్తుంది? తెలిసిన తరవాత క్రోధం రాదు. క్రోధం వస్తుంది కాబట్టి తెలియనే లేదు, కేవలం అహంకారం చేస్తున్నావు, 'నాకు తెలుసు' అని.

**ప్రశ్నకర్త:** క్రోధం జరిగిన తరవాత తెలుస్తుంది, క్రోధం చేయకూడదని .

**దాదాశ్రీ:** కాదు. కాని తెలిసిన తరవాత క్రోధం జరగదు. ఇక్కడ రెండు సీసాలు పడి ఉంటే, ఎవరో వచ్చి, 'ఇది మందు సీసా, మరియు రెండోది విషము సీసా' అని వివరించారు. రెండూ ఒకే లాగా కనిపిస్తాయి, కానీ దీనిలో పొరపాటు జరిగితే, ఇతనికి తెలియదని మనకి అర్థమవుతుంది కదా? పొరపాటు జరగక పోతే అతనికి తెలుసని అనవచ్చు, కానీ పొరపాటు జరిగితే అతనికి తెలియదని ఖచ్చితంగా చెప్పగలము కదా? అలాగే క్రోధం జరిగినప్పుడు ఏమీ తెలియదు, కానీ ఊరికే తెలుసు అనే అహంకారంతో తిరుగుతున్నావు. వెలుతురు ఉంటే దేనినైనా గుద్దుకుంటామా? కాబట్టి ఎప్పటి వరకైతే గుద్దుకుంటున్నామో, అప్పటి వరకు ఏమీ తెలుసుకోలేదు. చీకటిని వెలుతురు అంటే, అది మన తప్పే. కాబట్టి సత్సంగం లో కూర్చొని ఒక్క సారి 'తెలుసుకోండి', తరవాత క్రోధం-మానం-మాయ-లోభం అన్నీ వెళ్లిపోతాయి.

**ప్రశ్నకర్త:** కానీ క్రోధం అందరికి వస్తుంది కదా!

**దాదాశ్రీ:** ఈ తమ్ముడిని అడగండి, ఇతను రాదంటున్నాడు.

**ప్రశ్నకర్త:** సత్సాంగ్కి వచ్చిన తరవాత ఇక క్రోధం రాదు కదా!

**దాదాశ్రీ:** అవునా? ఇతను ఏ మందు వేసుకొని ఉంటాడు? ద్వేషము యొక్క మూల కారణం వెళ్లిపోయే మందు వేసుకున్నాడు.

## వివేకంతో

**ప్రశ్నకర్త:** నాకు నా దగ్గరివారిపై క్రోధం వస్తుంది. అతని దృష్టిలో అతను కరెక్ట్ అయ్యి ఉండవచ్చు, కానీ నా దృష్టి ప్రకారంగా నాకు క్రోధం వస్తుంది, మరి ఎందుకు నాకు క్రోధం వస్తుంది?

**దాదాశ్రీ:** మీరు ఇక్కడికి వస్తూ ఉన్నప్పుడు, ఈ ఇంటి పైన నుంచి ఒక రాయి మీ తలపైన పడి రక్తం వస్తే, ఆ సమయంలో మీరు క్రోధితులవుతారా?

**ప్రశ్నకర్త:** లేదు, ఇది 'హాపెన్డ్' (జరిగిపోయింది).

**దాదాశ్రీ:** కాదు, కాని అక్కడ క్రోధం ఎందుకు చేయరు? అంటే మనం ఎవ్వరిని చూడలేదు కాబట్టి క్రోధం ఎలా వస్తుంది?

**ప్రశ్నకర్త:** ఎవ్వరు కావాలని కొట్టలేదు.

**దాదాశ్రీ:** మరి మనం బయటకి వెళితే, అక్కడ ఒక పిల్లవాడు ఒక రాయి వేస్తే, అది మనకు తగిలి రక్తం వస్తే, మనం అతనిపై క్రోధితులం అవుతాము. ఎందుకు? ఇతను మన మీద రాయి వేసాడు కాబట్టి రక్తం వచ్చింది, అందుకని క్రోధిస్తాము, 'నువ్వు ఎందుకు కొట్టావు' అని. అదే కొండ పైన నుంచి ఒక రాయి దొర్లి వచ్చి మన తలకి తగిలి రక్తం వస్తే, చూస్తాము కాని క్రోధించము!

వీరి మనసులో ఏం ఉంటుందంటే 'ఇతనే చేస్తున్నాడు'. ఏ మనిషీ కావాలని కొట్టలేదు. అర్థమేంటంటే, కొండ మీద నుంచి రాయి పడటం, మరియు ఒక మనిషి రాయి వేయడం, రెండూ ఒకటే. కాని భ్రాంతి వలన ఇలా అనిపిస్తుంది, 'అతను చేసాడని'. ఈ వరల్డ్ లో ఏ మనిషికీ టాయిలెట్ కి వెళ్లే శక్తి కూడా లేదు.

'కావాలని ఎవరూ కొట్టలేదు' అని మనకి తెలిస్తే, అక్కడ క్రోధం రాదు. కాని ఏమంటారంటే, 'నాకు క్రోధం వస్తుంది, నా స్వభావమే క్రోధి'. అరే, స్వభావము వలన క్రోధం ఏమీ రాదు. అక్కడ పోలీస్ వాళ్ళ దగ్గర క్రోధం ఎందుకు రాదు? పోలీసు తిట్టినప్పుడు క్రోధం ఎందుకు రాదు? ఇతనికి భార్యపై క్రోధం వస్తుంది, పిల్లల పైన క్రోధం వస్తుంది, పొరుగువాడి పైన, 'అండర్హ్యాండ్' (కింద పనిచేసేవాడు) పైన క్రోధం వస్తుంది, కాని 'బాస్' పైన క్రోధం ఎందుకు రాదు? క్రోధం ఊరికే స్వభావం వలన రాలేదు. ఇక్కడ మాత్రం తనకి కావాల్సింది తక్కించుకోవాలి కాబట్టి క్రోధం చేస్తాడు.

**ప్రశ్నకర్త:** ఎలా కంట్రోల్ చేయాలి?

**దాదాశ్రీ:** అవగాహనతో మీ ఎదుట వచ్చే వారు నిమిత్తు మాత్రమే, మరియు మీ కర్మ ఫలాన్నే ఇస్తున్నారు. అతను నిమిత్తుడయ్యాడు. ఇప్పుడు ఇలా అర్థమవుతే క్రోధం కంట్రోల్ లోకి వస్తుంది. మీరు రాయి కొండ మీద నుంచి పడిందని చూసినప్పుడు క్రోధం కంట్రోల్ లోకి వచ్చింది. మరి దీనిలో కూడా అర్థం చేసుకోండి, 'అందరూ కొండలే' అని.

దారిలో వెళ్తుంటే, ఎవరైనా తప్పు దారిలో బండి నడుపుతూ మీ ఎదురుగా వచ్చేస్తే, మీరు గొడవపడతారా? క్రోధం చేసుకోరు కదా? ఎందుకు? ఆ బండిని గుద్దేస్తారా? ఇలా చేస్తారా? లేదు. ఐతే అక్కడ ఎందుకు చేయరు? అక్కడ అర్ధం చేసుకుంటారు, 'నేను చనిపోతాను', అని. అర్రే, దాని కంటే ఎక్కువ ఇక్కడ క్రోధం చేయడం వలన చనిపోతుంటారు. కాని ఈ చిత్రం కనిపించదు మరియు అది స్పష్టంగా కనిపిస్తుంది, ఇంతే తేడా ఉంది! అక్కడ రోడ్డు మీద ఎదురు తిరుగుతారా? క్రోధం చేసుకోరా, ఎదుటి వారి తప్పు ఉన్నాసరే?

**ప్రశ్నకర్త:** లేదు.

**దాదాశ్రీ:** అదే విధంగా జీవితంలో కూడా ఇలా అర్ధం చేసుకోవాలి.

## పరిణామము కాజెస్ మారిస్తేనే మారుతుంది

ఒక సోదరుడు నాకు చెప్పాడు, 'అనంత జన్మల నుంచి ఈ క్రోధాన్ని తొలగిస్తున్నాము, అయినా సరే ఈ క్రోధం ఎందుకు వెళ్ళుట లేదు?' అప్పుడు నేనేమి చెప్పానంటే, 'మీకు క్రోధం తొలగించే ఉపాయము తెలియదు.' అప్పుడు అతను చెప్పాడు, 'క్రోధం తొలగించడానికి శాస్త్రాలలో చెప్పిన ఉపాయాలన్నీ చేస్తున్నాను, అయినా సరే క్రోధం వెళ్లుట లేదు'. అప్పుడు నేను చెప్పాను, 'సమ్యక ఉపాయము చేయాలి'. అప్పుడు అతను చెప్పాడు, 'చాలా సమ్యక ఉపాయాలు చదివాను కాని వాటిలో ఒక్కటి కూడా పనికి రాలేదు.' అప్పుడు నేను చెప్పాను, ' క్రోధాన్ని ఆపడానికి ఉపాయము వెతకడం మూర్ఖత్వం, ఎందుకంటే క్రోధం ఒక పరిణామము. ఉదాహరణకి మీరు పరీక్ష రాసారు మరియు రిసల్ట్ వచ్చింది, మరియు నేను రిసల్ట్ ని నాశనం చేయడానికి ఉపాయాలు చేస్తే, ఎలా ఉంటుందో, క్రోధాన్ని నాశనం చేయడం కూడా అలాగే. ఈ రిసల్ట్ దేని పరిణామమో, దానిని మార్చే ప్రయత్నం చేయాలి.'

మన ప్రజలు ఏం చెప్పారంటే, 'క్రోధాన్ని అణిచివేయండి, క్రోధాన్ని తొలగించండి'. అర్రే, ఎందుకు ఇలా చేస్తున్నారు? కారణం లేకుండా మెదడుని పాడు చేసుకుంటున్నారు. అయినా సరే, క్రోధం తొలగిపోవడం లేదు. అప్పుడు కూడా వీళ్ళేమంటారంటే, 'లేదు సారూ, కొంచెం క్రోధం అణిగిపోయింది.' అర్రే, ఎప్పటి వరకైతే అది లోపల ఉంటుందో, అప్పటి

వరకు అది పోయిందని చెప్పలేము. అప్పుడు ఆ సోదరుడు చెప్పాడు, 'ఐతే మీ దగ్గర వేరే ఏదైనా ఉపాయము ఉందా?' అప్పుడు నేను చెప్పాను, 'అవును ఉపాయము ఉంది, మీరు చేస్తారా?' అప్పుడు అతను చెప్పాడు, 'చేస్తాను'. అప్పుడు నేను చెప్పాను, 'ఒక్క సారి నోట్ చేయండి మీకు ఈ ప్రపంచంలో అందరికంటే ఎక్కువ క్రోధం ఎవరి మీద వస్తుంది?' ఎక్కడ-ఎక్కడ క్రోధం వస్తుందో, అది నోట్ చేయండి, మరియు ఎక్కడ క్రోధం రాదో అది కూడా తెలుసుకోండి. ఒక సారి లిస్ట్ లో వేసేయండి, ఈ వ్యక్తి పైన క్రోధం రాదని. కొంత మంది వ్యతిరేకంగా చేసినా, వారిపైన క్రోధం రాదు మరియు కొంత మంది మంచి చేసినా వారిపైన క్రోధం వస్తుంది, మరి దీనికి ఏదైనా కారణం ఉంటుంది కదా?

**ప్రశ్నకర్త:** వారిపైన మనసులో గ్రంథి ఉండి ఉంటుంది, కదా?

**దాదాశ్రీ:** అవును, గ్రంథి ఏర్పడింది, ఆ గ్రంథిని వదిలి వేయడానికి ఇప్పుడు ఏం చేయాలి? పరీక్ష ఎప్పుడో రాసేసాము. ఎన్ని సార్లయితే వారిపై క్రోధం రావాలో, అన్ని సార్లు వస్తుంది, మరియు దాని కోసం గ్రంథి కూడా ఏర్పడింది. కాని ఇకపై మీరు ఏమీ చేయాలి? ఎవరి మీదయితే క్రోధం వస్తుందో వారి పట్ల మనసులో చెడు భావం రాకుండా చూడాలి. మనసుని మెరుగు పరచాలి, 'నా విధి ప్రకారం ఈ వ్యక్తి ఇలా చేస్తున్నాడు. అతను ఏదైతే చేస్తున్నాడో, నా కర్మ ఉదయం ప్రకారమే చేస్తున్నాడు'. ఈ విధంగా మనసుని మెరుగు పరుచుకోవాలి. ఇలా మనసుని మెరుగు పరుస్తూ-పరుస్తూ, ఎప్పుడైతే ఎదుటి వారి పట్ల మనసు మెరుగు పడుతుందో అతని పట్ల క్రోధం రావడం ఆగిపోతుంది. కొంత సమయం, ముందున్న ఇఫెక్ట్ ఏదైతే ఉందో, అంత ఇఫెక్ట్ ఇచ్చిన తరవాత ఆగిపోతుంది.

ఇది కొంచం సూక్ష్మ విషయము. ఇది సూక్ష్మము కాబట్టే ప్రజలు తెలుసుకోలేక పోయారు. ప్రతి విషయానికి ఉపాయం ఉంటుంది కదా! జగత్తు ఉపాయము లేకుండా ఐతే లేదు కదా! జగత్తు పరిణామమునే నాశనం చేయాలనుకుంటుంది. కాబట్టి క్రోధం-మానం-మాయ మరియు లోభం యొక్క ఉపాయము ఇదే. పరిణామముని ఏమి చేయవద్దు, వాటి కాజెస్ ని నిర్మూలించండి, అప్పుడే ఇవన్నీ వెళ్లిపోతాయి. కాబట్టి అతను స్వయంగా ఆలోచనాపరుడై ఉండాలి, లేకపోతే అజాగృతంగా ఉంటే ఉపాయం ఎలా చేస్తాడు?

**ప్రశ్నకర్త:** కాజెస్ ఏ విధంగా నిర్మూలించాలో మళ్ళీ కొంచెం వివరించండి!

**దాదాశ్రీ:** ఈ వ్యక్తిపై నాకు క్రోధం వస్తూ ఉంటే నేను నిర్ణయించుకుంటాను, 'ఇతనిపైన వచ్చే క్రోధము, నేను ఇంతకు ముందు అతని దోషాలు చూసాను కదా, దాని పరిణామము. ఇప్పుడు అతను ఏదైతే దోషం చేస్తున్నాడో, అది నేను మనసులోకి తీసుకోకపోతే, అతని పట్ల క్రోధము నిర్మూలము అవుతుంది. కాని పూర్వ పరిణామాలు ఏవైనా ఉంటే, అవి వచ్చేస్తాయి కాని ఇకపై, వేరేవన్నీ ముగిసిపోతాయి.

**ప్రశ్నకర్త:** వేరే వారి దోషాలు కనిపిస్తాయి, దీని వలనే క్రోధం వస్తుందా?

**దాదాశ్రీ:** అవును. ఈ దోషాలు చూస్తున్నాము, ఇది కూడా తెలుసుకొని ఉంచాలి, 'ఇది తప్పు పరిణామము' అని. అంటే, ఎప్పుడైతే ఈ తప్పు పరిణామము చూడడం ఆగిపోతుందో, క్రోధము కూడా ఆగిపోతుంది. మనం దోషం చూడడం ఆపివేస్తే, అన్నీ ఆగిపోతాయి.

## కోపం యొక్క మూలంలో అహంకారము !

ప్రజలు అడుగుతారు, 'మా ఈ క్రోధము యొక్క చికిత్స ఏమిటి?' నేను చెప్పాను, 'ఇప్పుడు మీరు ఏం చేస్తుంటారు?' అప్పుడు చెప్తారు, 'క్రోధాన్ని అణిచివేస్తాము'. నేను అడిగాను, 'గుర్తించి అణిచివేస్తారా, లేదా గుర్తించకుండానే నా? క్రోధాన్ని గుర్తించాలి కదా?' క్రోధం మరియు శాంతి, రెండు కలిసి ఉన్నాయి. ఇప్పుడు మనం క్రోధాన్ని గుర్తించకుండా శాంతిని అణిచివేస్తే శాంతి చనిపోతుంది, మరి'. అంటే, ఇది అణిచి వేసే విషయము కాదు. అప్పుడు అతనికి అర్థమైంది, క్రోధము అహంకారమని. ఇప్పుడు ఎలాంటి అహంకారము వలన క్రోధం వస్తుందో, అది కనుక్కోవాలి.

అబ్బాయి గ్లాసు పగలకొడితే క్రోధం వచ్చింది, దీనిలో మన అహంకారము ఏముందంటే ఈ గ్లాస్లో నష్టం వస్తుందనే అహంకారము. మనకి లాభం-నష్టం యొక్క అహంకారము ఉంది. కాబట్టి లాభం-నష్టం యొక్క అహంకారాన్ని గమనించి నిర్మూలించండి. తప్పుడు అహంకారాన్ని రక్షించి ఉంచితే క్రోధం వస్తుంది. క్రోధం, లోభం, అన్నిటికీ మూలం అహంకారమే.

## క్రోధాన్ని అణుచుకోవడానికి ఏ అవగాహన ఉండాలి ?

క్రోధం అంటే అహంకారము. ఇప్పుడు ఇది మనకి తెలియాలి. ఏ విధంగా ఇది అహంకారమో మనం కనుక్కోవడానికి ప్రయత్నించినప్పుడే అది అహంకారము అని పట్టుబడుతోంది. ఈ క్రోధం ఎలా ఉత్పన్నమైంది? అప్పుడు ఏమంటారంటే, 'ఈవిడ కప్ మరియు ప్లేట్ పగలకొట్టేసింది కాబట్టి క్రోధం ఉత్పన్నమైంది'. కప్పు మరియు ప్లేటు పగలకొడితే మనకి ప్రాబ్లెమ్ ఏంటి? అప్పుడేమంటారంటే, 'ఇంట్లో నష్టం జరిగింది.' మరి నష్టం వస్తే ఆవిడను తిట్టాలా? కానీ అహంకారము చేయడం, తిట్టడం లాంటివాటి గురించి స్పష్టముగా ఆలోచిస్తే, ఎలా అంటే, ఆలోచించగానే ఆ అహంకారము అంతా కరిగిపోతుంది. ఇప్పుడు ఈ కప్పు పగలడం నివార్యమా, అనివార్యమా? నివార్యమైన సంయోగాలు ఉంటాయా లేదా? సేవకుడిని యజమాని తిడతాడు, 'అర్రే, కప్పు మరియు ప్లేటు ఎందుకు పగలకొట్టావు? నీకు చేతులు లెవా?' అది, ఇది... అది అనివార్యమైతే అతనిని తిట్ట వచ్చునా? అల్లుడు గారి చేతి నుంచి కప్పు మరియు ప్లేటు పగిలితే, అక్కడ ఏమి చెప్పలేరు! ఎందుకంటే, అతను సుపీరియర్, అక్కడ ఏమి అనలేము! అదే ఇంఫిరియార్ ఐతే తిడుతూనే ఉంటాము! ఇదంతా ఇగోయిజం. సుపీరియర్ ముందు అందరు మౌనం ధరిస్తారు కదా? ఈ దాదా చేతి నుంచి ఏదైనా పగిలిపోతే ఎవ్వరి మనసులోనూ ఏమి రాదు, కానీ పనివాడి చేతిలో నుంచి పగిలితే?

ఈ విశ్వం న్యాయాన్ని ఎప్పుడూ చూడనే లేదు. ఇదంతా మూర్ఖత్వం వలనే. బుద్ధి కొంచెం తెలివైనదైవుంటే వికసించి ఉంటే, అవగాహనా ఉంటే ఏ గొడవ జరగదు. ఇప్పుడు గొడవ పడితే కప్పు మరియు ప్లేటు అతుక్కుపోతాయా? ఏదో సంతోషం పొందుతారు, అంతే కదా? కానీ దీని వలన కలహము జరుగుతుంది, మనసులో ఇబ్బంది కలుగుతుంది. ఈ వ్యాపారములో కప్పు పోయిన నష్టం ఒకటి, దానికి తోడు, ఈ కలహము జరిగిన నష్టం రెండోది, మరియు మూడవ నష్టం ఏంటంటే, పనివాడితో శత్రుత్వం! పనివాడు పగ పడతాడు, 'నేను పేద వాడిని కాబట్టి ఇతను నన్ను ఇలా అంటున్నాడు కదా!' ఈ పగ మనల్ని వదలదు. భగవంతుడు ఏం చెప్పాడంటే, 'ఎవ్వరితోనూ శత్రుత్వం కలిగించుకో వద్దు. బహుశా ఎవరితోనైనా ప్రేమతో ముడిపడవచ్చు కానీ పగతో ముడిపడ వద్దు. ఎందుకంటే ప్రేమ ఉంటే, ఆ ప్రేమ

దానికదే శత్రుత్వాన్ని తవ్వి వేస్తుంది. ప్రేమ ఎలాంటిదంటే శత్రుత్వము యొక్క సమాధిని తొవ్వేస్తుంది కాని శత్రుత్వంతో శత్రుత్వము ఇంకా పెరుగుతూ ఉంటుంది. ఇలా నిరంతరంగా పెరుగుతూనే ఉంటుంది. శత్రుత్వం వలనే కదా ఇక్కడ సంచరిస్తున్నాము! ఈ మనుషులు ఎందుకు సంచరిస్తున్నారు? తీర్థంకరుడు కలవ లేదా? అప్పుడు అంటారు, 'లేదు, తీర్థంకరులు చాలా మంది కలిశారు, వారి దేశన కూడా విన్నాము కానీ ఏమి అవ్వలేదు.'

ఏ విషయాలలో అడ్డంకులు వస్తాయి? ఎక్కడెక్కడ ఇబ్బంది కలుగుతుంది? ఆ ఇబ్బందులని అంతము చేయండి. సంకుచిత దృష్టి వలనే ఇబ్బందులు కలుగుతాయి. కాని 'జ్ఞానీ పురుషులు' లాంగ్ సైట్ ఇస్తారు. ఆ లాంగ్ సైట్ ఆధారంగా అన్నీ 'ఎలా ఉందో అలాగే' కనిపిస్తాయి.

## పిల్లలపైన కోపం వచ్చినప్పుడు...

**ప్రశ్నకర్త:** ఇంట్లో పిల్లల పైన కోపం వచ్చినప్పుడు ఏమి చేయాలి?

**దాదాశ్రీ:** అర్థం చేసుకోక పోవడం వలనే కోపం వస్తుంది. మీరు అతనిని అడిగితే, 'నీకు చాలా సరదాగా అనిపించిందా?' అప్పుడు అతను చెప్తాడు, 'నాకు లోపల చాలా బాధ కలిగింది.' అతనికి బాధగా ఉంటుంది, మీకూ బాధగా ఉంటుంది. ఇందులో పిల్లవాడిపైన చిరాకు పడే అవసరం ఏమి ఉంది మరి? మరియు చిరాకు పడటం వలన బాగుపడితే చిరాకు పడండి. రిసల్ట్ (పరిణామము) మంచిగా వస్తే చిరాకు పనికి వస్తుంది. రిసల్ట్ ఏ సరిగ్గా రాక పోతే, మరి చిరాకు పడడంలో అర్థమేమి ఉంది? క్రోధం వలన లాభం ఉంటే చేయండి మరి, కాని లాభం లేక పోతే ఇలానే సర్దుకు పోండి!

**ప్రశ్నకర్త:** మేము కోపగించుకోక పోతే అతను మా మాట వినడు, అన్నం కూడా తినడు.

**దాదాశ్రీ:** కోపగించుకున్న తరవాత కూడా ఎక్కడ వింటాడు?!

## వితరాగుల సూక్ష్మతని చూడండి

అయినా సరే ప్రజలు ఏమంటారంటే, 'ఈ తండ్రి అతని కొడుకుపైన ఇంత కోపగించుకున్నాడు కదా, కాబట్టి ఈ తండ్రి పనికిరాని వాడు'. మరియు ప్రకృతి ఏ న్యాయాన్ని

ఇస్తుందో తెలుసా? 'ఈ తండ్రి భాగంలో పుణ్యం జమ చేయండి '. అవును, ఎందుకంటే కొడుకు మంచి కోసం స్వయంగా తన మీద సంఘర్షణని తీసుకుంటాడు కదా! కొడుకు సుఖం కోసం తన మీద తాను సంఘర్షణ తెచ్చుకుంటాడు, కాబట్టి ఇతనికి పుణ్యం ఇవ్వండి! లేకపోతే ఏ రకమైన క్రోధమైనా పాపాన్ని బంధిస్తుస్తుంది. కాని కేవలం ఈ క్రోధం, ఏదైతే పిల్లలు లేదా శిష్యుల సుఖం కోసం చేస్తారో, దానిలో మీరు స్వయాన్ని దహించి, వారి సుఖం కోసం చేస్తారు. కాబట్టి దీని వలన పుణ్యం కట్టుకుంటారు. అయినా సరే, ఇక్కడ ప్రజలు అతనిని అప్రతిష్టపాలు చేస్తూనే ఉంటారు. కాని ఈశ్వరుని గృహంలో సరి అయిన నియమం ఉంటుందా లేదా? ప్రజలు తమ పిల్లల పైన క్రోధం చేస్తారు, కానీ దానిలో హింసక భావం ఉండదు. మిగిలిన అన్ని చోట్లా హింసక భావం ఉంటుంది. అయినా సరే, దీనిలో తంతం ఉంటుంది, ఎందుకంటే కొడుకుని చూసినప్పుడల్లా లోపల మళ్ళీ ప్రతిక్రియ మొదలవుతుంది. దాని తంతము సాగుతుంది.

ఒకవేళ, క్రోధములో హింసక భావం మరియు తంతం, ఈ రెండు లేక పోతే మోక్షం వస్తుంది. మరియు హింసకభావం లేకుండా, కేవలం తంతం ఉంటే, పుణ్యం వస్తుంది. భగవంతుడు ఎంత సూక్ష్మంగా కనిపెట్టారు కదా!

## క్రోధము చేసినా పుణ్యము బంధిస్తారు !

భగవంతుడు ఏమి చెప్పారంటే, ఒక వేళ వేరే వాళ్ళ మంచి కోసం క్రోధము చేస్తే, పరమార్థం కోసం క్రోధం చేస్తే దాని ఫలస్వరూపంలో పుణ్యం వస్తుంది.

ఇప్పుడు ఈ క్రమిక మార్గంలో శిష్యుడు భయపడుతూనే ఉంటాడు, 'ఇప్పుడే ఏదో అంటారు, ఇప్పుడే ఏదో అంటారు', మరియు ఆ గురువు కూడా రోజంతా, పొద్దుట్నుంచి రెచ్చిపోయి కూర్చొని ఉంటారు. ఐతే పదవ గుణస్థానకము వరకు ఇదే పరిస్థితి. ఆయన కళు ్ ఎర్రగా చేస్తే, లోపల అగ్ని అంటుకుంటుంది. ఈ వేదన, ఎంత వేదన ఉండవొచ్చు! ఇలా మోక్షానికి ఎలా చేరుకో గలము? మోక్షం పొందడము లడ్డు తినే అంత సులభమా? ఇది, ఎప్పుడో ఒక సరి ఇలాంటి అక్రమ విజ్ఞానము ప్రకటిస్తుంది కాబట్టి సులభము!

## క్రోధమంటే ఒక రకమైన సిగ్నల్ !

ప్రపంచములోని ప్రజలు ఏమంటారంటే ఇతను తన పుత్రుడిపైన క్రోధం చేసుకున్నాడు కాబట్టి ఇతను దోషితుడు, మరియు ఇతను పాపం కట్టుకున్నాడు. కాని, భగవంతుడు ఇలా చెప్పరు. భగవంతుడు ఏమంటారంటే, 'కొడుకు మీద క్రోధించలేదు కాబట్టి అతని తండ్రి దోషితుడు. కాబట్టి అతనిపైన వంద రూపాయల జరిమానా.' అప్పుడు ఎవరైనా 'క్రోధము చేయాడం మంచిదా?', అని అడిగితే, 'లేదు, కాని ఇప్పుడు దాని అవసరము ఉండింది. ఒకవేళ ఇక్కడ క్రోధం చేసి ఉండక పోతే కొడుకు తప్పుడు దారిలోకి వెళ్లి ఉండే వాడు.'

అంటే క్రోధం ఒక రకమైన రెడ్ సిగ్నల్, ఇంక ఏమి కాదు. ఒకవేళ కళ్ళు ఎర్రగా చూపించక పోయుంటే, క్రోధం చేసి ఉండక పోయుంటే, కొడుకు తప్పుడు దారి లోకి వెళ్లి ఉండేవాడు. కాబట్టి భగవంతుడు ఐతే, తండ్రి తన పుత్రుడు పైన క్రోధం చేసుకున్నా సరే వంద రూపాయల బహుమానం ఇస్తారు.

క్రోధం ఒక ఎర్ర జెండా. పబ్లిక్కి ఇది తెలియదు, మరియు ఎంత వరకు ఎర్ర జెండా చూపించాలి, ఎంత సేపు చూపించాలి, ఇది తెలుసుకునే అవసరం ఉంది. ఇప్పుడు రైలు బండి వెళ్తుంటే, రెండున్నర ఘంటల ముందు నుంచే ఎర్ర జెండా పట్టుకొని, ఏ కారణం లేకుండా నిలుచొని ఉంటే ఏమి జరుగుతుంది? అంటే ఎర్ర సిగ్నల్ అవసరము కాని ఎంత సేపు ఉంచాలో, అది తెలుసుకునే అవసరము ఉంది.

చల్లగా (శాంతితో ఉండడం), అది గ్రీన్ సిగ్నల్!

## రౌద్రధ్యానము ధర్మధ్యానముగా రూపాంతరమవుతుంది

పిల్లలపై క్రోధం చేసినా కాని లోపల మీ భావము ఏమి ఉంది, 'ఇలా జరగ కూడదు.' లోపల మీ భావము ఏమిటి?

**ప్రశ్నకర్త:** ఇలా జరగ కూడదు.

**దాదాశ్రీ:** అంటే ఇది రౌద్రధ్యానము ఉండింది, అది ధర్మధ్యానములోకి రూపాంతరమయింది. క్రోధం జరిగినా సరే ఫలితముగా ధర్మధ్యానము వచ్చింది.

**ప్రశ్నకర్త:** ఇలా జరగ కూడదనే భావము ఉంది కాబట్టేనా?

**దాదాశ్రీ:** దాని వెనకాల హింసకభావము లేదు. హింసకభావము లేకుండా క్రోధము ఎన్నటికీ జరగలేదు. కాని క్రోధానికి ఒక ప్రత్యేక దశ ఉంది, ఎవరైన తన సొంత పుత్రుడు, మిత్రుడు లేదా భార్యపైన క్రోధం చేసుకుంటే పుణ్యం కట్టుకుంటాడు. ఎందుకంటే క్రోధం చేయడం వెనకాల ఉన్న ఉద్దేశ్యమే ముఖ్యమైనది.

**ప్రశ్నకర్త:** ప్రశస్త క్రోధం.

**దాదాశ్రీ:** అప్రశస్త క్రోధం తప్పు.

కాబట్టి ఈ క్రోధంలో కూడా ఇంత తేడా ఉంది. రెండవది, డబ్బు కోసం కొడుకుని తిట్టడం, 'నువ్వు వ్యాపారంలో సరిగ్గా దృష్టి ఉంచుట లేదు', అని, ఆ క్రోధము వేరు. పిల్లలను మెరుగుపరచడానికి, దొంగతనము లేక వేరే ఏదైనా తప్పుడు పనులు చేసినప్పుడు తిడితే, క్రోధం చేస్తే, భగవంతుడు ఏమి చెప్పారంటే, దీని ఫలితము పుణ్యము. ప్రభువు ఎంత తెలివైనవాడు!

## తెలివైన వారు క్రోధాన్ని ఈ విధంగా నివారిస్తారు !

**ప్రశ్నకర్త:** మనం క్రోధము ఎవరిపైన చేసుకుంటాము? ముఖ్యముగా, ఆఫీసులో సెక్రటరీ మీద క్రోధం చేయము మరియు ఆసుపత్రిలో నర్సు పైన క్రోధం చేయము, కాని ఇంట్లో భార్య పైనే ఎందుకు క్రోధం చేస్తాము?

**దాదాశ్రీ:** అందుకే కదా, వంద మంది కూర్చొని వింటున్నప్పుడు నేను అందరికీ చెప్తూ ఉంటాను, ఆఫీసులో బాస్ (యజమాని) బెదిరించినప్పుడు లేదా ఎవరైన తిట్టినప్పుడు వారు అందరి క్రోధాన్ని ఇంట్లో భార్యపైన చూప్పిస్తారు. అందుకే నేను చెప్ప వలసి వస్తుంది, 'అరే! భార్యని ఎందుకు తిడ్తున్నారు? కారణం లేకుండా భార్యను తిడ్తున్నారు! బయట ఎవరైనా బెదిరిస్తే, వారితో పోరాడండి, ఇక్కడ ఈమెతో ఎందుకు?

నాకు తెలిసిన ఒక వ్యక్తి ఉండే వాడు. అతను నాకు ఎప్పుడూ చెప్తూ ఉండేవాడు, ‘సారూ, ఒకసారి మా ఇంటికి రండి!’ రాతి పని చేస్తూ ఉండేవాడు. ఒక సారి నేను అటు వైపు వెళ్తూ ఉన్నప్పుడు, కలిసాడు, మరియు ‘మా ఇంటికి పదండి, కొంచెం సేపు కోసం.’ అన్నాడు. అప్పుడు నేను అతని ఇంటికి వెళ్ళాను. అక్కడ నేనేం అడిగానంటే, ‘అర్రే, రెండు రూములు నీకు సరిపోతాయా?’ అప్పుడు అతను చెప్పాడు, ‘నేను రాతి పని చేస్తుంటాను కదా!’ ఇది మా జమానా, మంచి జమానా మాట చెప్తున్నాను. ఇప్పుడైతే ఒక రూమ్‌లో ఉండవలసి వస్తుంది, కాని మంచి జమానాలో కూడా అతనికి రెండు రూములు మాత్రమే ఉండేవి! అప్పుడు నేను అడిగాను, ‘మీ భార్య నిన్ను ఇబ్బంధి పెట్టదా?’ అప్పుడు చెప్పాడు, ‘భార్యకు క్రోధం వస్తుంది కాని నేను క్రోధం చేసుకోను.’ నేను అడిగాను, ‘ఎందుకు అలా?’ అతను చెప్పాడు, ‘ఒక వేళ ఆమె క్రోధం చేస్తే, నేను కూడా చేస్తే, మరి ఈ రెండు రూముల్లో నేను ఎక్కడ పడుకోవాలి, మరియు ఆమె ఎక్కడ పాడుకోవాలి?’ ఆమె మొహం అటు తిప్పి పడుకొని, నేను కూడా నా మొహం ఇటు తిప్పి పడుకొని, ఈ పరిస్థితిలో నాకు పొద్దున్న చాయ్ కూడా మంచిగా దొరకదు. ఆమె నాకు సుఖాన్ని ఇస్తుంది. ఆమె వలనే నాకు సుఖం ఉంది. నేను అడిగాను, ‘మరి, భార్య క్రోధం చేస్తే?’ అతను చెప్పాడు, “ఆమెను బుజ్జగిస్తాను, ‘వదిలేయండి, నా పరిస్థితి నాకే తెలుసు’, అది ఇది చేసి బుజ్జగిస్తాను, కాని ఆమెని సంతోషంగా ఉంచుతాను. బయట కొట్లాడి వస్తాను కాని ఇంట్లో, ఆమెతో మాత్రం కొట్లాడను.” మరియు చాలా మంది బయట తన్నులు తిని వచ్చి ఇంట్లో కొట్టుకుంటారు.

వీళ్ళు ఎప్పుడూ క్రోధం చేస్తూనే ఉంటారు. ఆవులు-గేదలు మంచివి, క్రోధం చేయవు కదా! జీవితంలో కొంచెం శాంతి ఉండాలి కదా! బలహీనులయి ఉండ కూడదు. ఇక్కడ ప్రతి గంటా క్రోధం అవుతుంది. మీరు బండి లో వచ్చారు కదా? ఒక వేళ బండి దారిలో క్రోధం చేస్తూ ఉంటే ఏమి జరుగుతుంది?

**ప్రశ్నకర్త:** ఐతే ఇక్కడకి చేరుకో లేము.

**దాదాశ్రీ:** మరి మీరు క్రోధం చేస్తే, ఆమె బండి ఎలా నడుస్తూ ఉండి ఉంటుంది? నువ్వు క్రోధము చేసుకోవు కదా?

**ప్రశ్నకర్త:** అప్పుడప్పుడు జరుగుతుంది.

**దాదాశ్రీ:** మరియు ఒకవేళ ఇద్దరికీ క్రోధం వస్తే ఇంక ఏమి మిగులుతుంది?

**ప్రశ్నకర్త:** భార్యా-భర్తల మధ్య కొంచమైనా క్రోధము జరగాలి కదా?

**దాదాశ్రీ:** లేదు, ఇలా ఏమి నియమము లేదు. భార్యా-భర్తల మధ్య ఐతే చాలా శాంతి ఉండాలి. ఒక వేళ దుఃఖం ఉంటే వారిని భార్యా-భర్తలు అని అననే లేము. నిజమైన ఫ్రెండ్షిప్ లో దుఃఖము ఉండదు, అయితే, ఇది అందరికన్నా గొప్ప ఫ్రెండ్షిప్!! ఇక్కడ క్రోధము ఉండ కూడదు. కాని ప్రజలు బలవంతంగా అందరిని ఇలా నమ్మిస్తారు, వారికి క్రోధం వస్తుంది కాబట్టి ఇది నియమం అని చెప్పారు! వేరే అన్ని చోట్లా జరిగినా పరవాలేదు కాని, భార్యా-భర్తల మధ్య ఐతే అస్సలు దుఃఖం ఉండ కూడదు.

## ఇష్టం వచ్చింది చేయడం వలన దెబ్బలు తింటాడు

**ప్రశ్నకర్త:** ఇంట్లో లేదా బయట స్నేహితులతో, ప్రతి చోటా ప్రతి ఒక్కరి మతం వేరు-వేరుగా ఉంటుంది మరియు మనం అనుకున్న విధంగా జరగక పోతే మనకి క్రోధం ఎందుకు వస్తుంది? అప్పుడు ఏమి చేయాలి?

**దాదాశ్రీ:** అందరు తమకి నచ్చింది చేయాలనుకుంటే ఏమి జరుగుతుంది? ఈ ఆలోచనే ఎందుకు వస్తుంది? వెంటనే అనుకోవాలి, 'అందరూ తాము అనుకున్నదే చేయాలనుకుంటే ఒకరు ఒకరితో పోరాడి, ఇక్కడ ఉన్న పాత్రలు విరగకొట్టేస్తారు, మరియు తినడానికి ఏమి మిగలదు. కాబట్టి మనకి నచ్చినట్టు ఎప్పుడూ చేయకూడదు. ఇది కావాలి అనే ఆశే పెట్టుకోవద్దు, ఇలా ఐతే ఎప్పుడూ తప్పు అవ్వదు. ఎవరికైతే అవసరమో వారు ఇష్టం వచ్చినట్టు చేస్తారు, అని అర్థం చేసుకోండి.

**ప్రశ్నకర్త:** నేను ఎంత శాంతిగా ఉన్నా సరే భర్త క్రోధం చేసుకుంటే నేను ఏమి చేయాలి?

**దాదాశ్రీ:** వారు క్రోధం చేసినప్పుడు మీరు కూడా గొడవ పడాలనుకుంటే, మీరు కూడా క్రోధం చేసుకోవాలి, లేక పోతే లేదు! మీకు 'ఫిల్మ్' ముగించాలని ఉంటే మీరు శాంతించండి. ఫిల్మ్ ముగించాలని లేక పోతే రాత్రంత కోన సాగించండి, ఎవరు వద్దన్నారు? మీకు ఇలాంటి 'ఫిల్మ్' ఇష్టమా?

**ప్రశ్నకర్త:** లేదు, ఇలాంటి ఫిల్మ్ ఇష్టం లేదు.

**దాదాశ్రీ:** క్రోధం చేసి ఏమి చేయాలి ? ఆ వ్యక్తి క్రోధం చేసుకోదు, ఆ 'మెకానికల్ అడ్జస్ట్మెంట్' (డిశ్చార్జ్ అయ్యే మనిషి ప్రకృతి) క్రోధం చేస్తుంది. అందుకే మళ్ళీ తమ మనసులో పశ్చాతాపం ఉంటుంది, 'ఈ క్రోధం చేసి ఉండక పోతే బావుండేది' అని.

**ప్రశ్నకర్త:** దానిని చల్లార్చే ఉపాయము ఏమిటి?

**దాదాశ్రీ:** మెషిన్ వేడెక్కితే, దానిని చల్లార్చాలంటే కొంచెం సేపు ఆపి వేస్తే, దానంతట అదే చల్లారిపోతుంది. అంతే కానీ, దానిలో చేయి వేసినా, లేదా దానిని ప్రేరేపించినా, మనమే కాలిపోతాము.

**ప్రశ్నకర్త:** నాకు నా భర్తతో క్రోధం మరియు తీవ్రమైన వాదనలు జరుగుతూ ఉంటాయి, మరి నేను ఏమి చేయాలి?

**దాదాశ్రీ:** క్రోధం నువ్వు చేస్తుంటావా, లేదా అతనా? క్రోధం ఎవరు చేస్తారు?

**ప్రశ్నకర్త:** అతను, తరవాత నా ద్వారా కూడా జరుగుతుంది.

**దాదాశ్రీ:** ఐతే లోపల మీరు మిమ్మల్ని మందలించండి, 'ఎందుకు నువ్వు ఇలా చేస్తున్నావు? ముందు చేసింది ఇప్పుడు అనుభవించాల్సిందే కదా!' కాని ప్రతిక్రమణ్ చేస్తే ఈ దోషాలన్నీ కరిగిపోతాయి. లేకపోతే, మనం ఇచ్చిన దుఃఖమే మనం అనుభవించ వలసి వస్తుంది కానీ ప్రతిక్రమణ్ చేయడం వలన కొంచెం మందకొడిగా అవుతాయి.

## ఇది ఒక రకమైన క్రూరత్వం

**ప్రశ్నకర్త:** మన ద్వారా క్రోధము జరిగితే మరియు ఎవరినైనా తిడితే, ఎలా మార్చుకోవాలి?

**దాదాశ్రీ:** ఇదేంటంటే, ఈ క్రోధం చేయడం, తిట్టడం లాంటివి ఎందుకు జరుగుతాయంటే, మనకి మన మీద కంట్రోల్ లేక పోవడం వలన. కంట్రోల్ చేయడానికి ముందు కొంచెం అర్థం చేసుకోవాలి. ఒక వేళ మన మీద ఎవరైనా క్రోధం చేస్తే మనకు సహనమవుతుందా లేదా, అని ఆలోచించాలి. మనం క్రోధం చేయక ముందే మన మీద ఎవరైనా క్రోధం చేస్తే మనం సహించగలమా? మనకి నచ్చుతుందా లేదా? మనకు ఎంత నచ్చుతుందో, అంతే ప్రవర్తన వేరే వారితో చేయాలి.

వారు మిమ్మల్ని తిడుతూ ఉన్నప్పుడు మీకు ఏమి ఇబ్బంది లేకపోతే, డిప్రెషన్ రాక పోతే మీరు కూడా చేయండి, లేదా ఆపి వేయండి. తిట్టడం మాత్రం ఎప్పుడూ చేయకూడదు. ఇది ఒక రకమైన క్రూరత్వం. అండర్ డెవలప్డ్ పీపుల్, అన్కల్చర్డ్ (అభివృద్ధి చెందని ప్రజలు, సంస్కారహీనుడు)!

## ప్రతిక్రమణే నిజమైన మోక్ష మార్గము !

ఇది వరకు, దయ ఉంచండి, శాంతి ఉంచండి, సమత ఉంచండి, క్షమా ఉంచండి ఇలాంటి ఉపదేశం ఇచ్చే వారు. అప్పుడు ఈ ప్రజలు ఏమనేవారు 'అర్రే! నాకు క్రోధం వస్తూ ఉంటుంది, మరియు నువ్వు క్షమ ఉంచమని చెప్తున్నావు, కాని నేను క్షమ ఎలా ఉంచగలను? కాబట్టి వీరికి ఎలాంటి ఉపదేశం ఇవ్వాలంటే, మీకు క్రోధం వస్తే మీరు ఈ విధంగా మనసులో పశ్చాత్తాపము చేయండి, 'నాలోని ఏ బలహీనత వలన క్రోధం వస్తుంది? ఇది నా ద్వారా తప్పు జరిగి పోయింది.' ఇలా పశ్చాత్తాపము చేయండి మరియు ఎవరైనా గురువు ఉంటే, వారి సహాయం తీసుకోండి, మరియు ఇంకెప్పుడు ఇలాంటి బలహీనత ఉండ కూడదని నిశ్చయించండి. ఇప్పుడు మీరు క్రోధాన్ని రక్షించ వద్దు మరియు దాని ప్రతిక్రమణ్ చేయండి.

అంటే పొద్దున్న నుంచి రాత్రి వరకు ఎన్ని అతిక్రమణ్ (ఆక్రమణ) లు జరిగాయి, మరియు ఎవరితో జరిగాయి, వాటన్నింటిని నోట్ చేస్తూ ఉండండి, మరియు అదే సమయంలో ప్రతిక్రమణ్ చేసేసేయండి.

ప్రతిక్రమణ్ లో ఏమి చేయాల్సి ఉంటుంది? మీకు క్రోధం వచ్చి ఎదుటి వ్యక్తికి బాధ కలిగితే అతని ఆత్మని గుర్తుతెచ్చుకొని క్షమించమని ప్రార్థించండి. అంటే, జరిగిందాని గురించి క్షమాపణ అడగండి మరియు మళ్ళీ ఇలా చేయకుండా ఉండాలని ప్రతిజ్ఞ తీసుకోండి. మరియు 'ఆలోచన' అంటే, 'నా ద్వారా ఈ దోషం జరిగింది' అని మా దగ్గర దోషాన్ని చూపించాలి (ఒప్పుకోవాలి).

## మనసులో కూడా క్షమాపణ అడగండి

**ప్రశ్నకర్త:** దాదాజీ, నేను పశ్చాతాపం లేదా ప్రతిక్రమణ్ చేసేటప్పుడు చాలా సార్లు ఏం అవుతుందంటే, నేనేమైన తప్పు చేసినా, ఎవరి మీదైనా క్రోధం చేసినా, నేను చేసిన తప్పులన్నిటి కోసం లోపల బాధగా ఉంటుంది, కానీ ఎదుటి వారి దగ్గర క్షమాపణ అడిగే ధైర్యం ఉండదు.

**దాదాశ్రీ:** ఇలా క్షమాపణ అడగవలసిన అవసరమే లేదు, లేక పోతే వారు దురుపోయోగం చేస్తారు, 'అవును, ఇప్పుడు అర్థమైందా', అని. ఇలా ఉంటుంది, నోబెల్ జాతి కాదు! ఈ వ్యక్తులు క్షమాపణకు అర్హులు కారు. కాబట్టి వారి శుద్దాత్మను గుర్తుతెచ్చుకొని, మనసులోనే క్షమాపణ అడగండి. వేయి మందిలో ఒకరు ఎవరైనా ఒకరే ఉంటారు, ఎవరైతే మీరు క్షమాపణ అడగక ముందే నమస్కరిస్తారు.

## నగదు పరిణామం హృదయ పూర్వక ప్రతిక్రమణ్ తో

**ప్రశ్నకర్త:** ఎవరి మీదైనా చాలా క్రోధం జరిగితే, జవాబు ఇచ్చాక మౌనం ధరిస్తాను. తరవాత నేను మాట్లాడిన మాటల గురించి నా హ్రిదయములో చాలా బాధగా ఉంటుంది. దాని కోసం ఒకటి కంటే ఎక్కువ ప్రతిక్రమణ్ చేయాలా?

**దాదాశ్రీ:** రెండు- మూడు సార్లు హృదయపూర్వకంగా ప్రతిక్రమణ్ చేయండి, అప్పుడు సరి అయిపోతే, అయిపోయింది. 'హే దాదా భగ్వాన్! నా ద్వారా విపరీతమైన క్రోధం జరిగింది, ఎదుటి వారికి చాలా కష్టం అయింది! దాని కోసం క్షమాపణ అడుగుతున్నాను. మీ సాక్షిగా క్షమాపణ అడుగుతున్నాను.'

## తప్పు, కానీ జీవం లేనిది

**ప్రశ్నకర్త:** అతిక్రమణ్ వలన వచ్చే ఉగ్రహము ప్రతిక్రమణ్ తో శాంతిస్తుందా?

**దాదాశ్రీ:** అవును, శాంతిస్తుంది. జిగురు ఫైల్ (గాఢంగా ఋణానుబంధం ఉన్న ఖాతా) ఉంటే, అక్కడ ఐదు వేల ప్రతిక్రమన్లు చేయ వలసి ఉంటుంది, అప్పుడే శాంతిస్తుంది. ఒక వేళా, కోపం బయటకి రాకుండా కేవలం చిరాకు పడితే, అప్పుడు ప్రతిక్రమణ్ చేయక పోతే, ఆ మరక మనలో ఉండిపోతుంది. ప్రతిక్రమణ్ చేసినప్పుడు క్లియర్ అవుతుంది. అతిక్రమణ్ చేసారు కాబట్టి ప్రతిక్రమణ్ చేయండి.

**ప్రశ్నకర్త:** ఎవరి మీదైనా క్రోధం జరిగిన తర్వాత దృష్టిలోకి వచ్చి, అదే క్షణంలో క్షమాపణ అడిగేస్తే, దీనిని ఏమి అంటారు?

**దాదాశ్రీ:** ఇప్పుడు జ్ఞానము తీసుకున్న తరవాత క్రోధం జరిగితే, మరియు క్షమాపణ అడిగితే ఏమి ఇబ్బంది లేదు. దీని నుంచి ముక్తి లభిస్తుంది! కాని ఇలా ముఖా ముఖి క్షమాపణ అడగ లేని పరిస్థితి ఉంటే మనసులోనే అడగండి, అంతే! అయిపోయింది.

**ప్రశ్నకర్త:** ముఖా ముఖి, అందరి ముందు?

**దాదాశ్రీ:** పరవాలేదు. ఈ విధంగా అడగకుండా లోపల ప్రతిక్రమణ్ చేసినా చాలు, ఎందుకంటే ఈ తప్పు కి జీవం లేదు, ఇది డిశ్చార్జ్ మాత్రమే. 'డిశ్చార్జ్' తప్పు అంటే ఇది ఛార్జ్ తప్పు కాదు. కాబట్టి మరీ చెడు ఫలితాన్ని ఇవ్వదు.

## ప్రతిష్టించడం వలనే కాషాయాలు

ఇదంతా మీరేమి నడపరు, క్రోధం-మానం-మాయ-లోభం, మొదలైన కాషాయాలు నడుపుతాయి. కాషాయాలదే రాజ్యం! ఎప్పుడైతే, 'నేను ఎవరిని', అని తెలుస్తుందో, అప్పుడే కాషాయాలు వెళ్లిపోతాయి. క్రోధం వచ్చినప్పుడు పశ్చాత్తాపము కలుగుతుంది, కాని భగవంతుడు చెప్పిన ప్రతిక్రమణ్ చేయడం రాకపోతే ఏమి చేయాలి? ప్రతిక్రమణ్ చేయడం వస్తే వదిలించుకో గలిగే వారు.

అంటే ఈ క్రోధం-మానం-మాయ-లోభం ఎంత కాలం విస్తరిస్తాయి? ఎప్పుడు వరకైతే, 'నేనే చందు (రీడర్ పేరును చొప్పించండి), మరియు నేను ఇలాంటి వాడిని' అని నమ్ముతామో అప్పుడు వరకు ఉంటుంది. 'నేను చందు' అని లోకం మన మీద ప్రతిష్ట చేసింది మరియు మనం దానిని నమ్మాము, ఎప్పటి వరకైతే మనం ప్రతిష్ట చేస్తామో, 'నేను చందు' అని, అప్పటి వరకు ఈ క్రోధం-మానం-మాయ-లోభం లోపల ఉంటాయి.

మనం చేసిన ప్రతిష్ట ఎప్పుడు సమాప్తమవుతుందంటే, 'నేను శుద్ధాత్మా' అని తెలుసుకున్నప్పుడు. మనం మన నిజ స్వరూపములోకి వచ్చినప్పుడు ఆ ప్రతిష్ట విరిగిపోతుంది మరియు క్రోధం-మానం-మాయ-లోభం వెళ్లిపోతాయి, లేకపోతె వెళ్లవు. కొడుతూ ఉన్నాసరే వెళ్లవు, పైగా పెరుగుతూ ఉంటాయి. ఒకటి తగ్గిస్తే, రెండోది పెరుగుతుంది, మరియు రెండోది తగ్గిస్తే మూడవది పెరుగుతుంది.

## క్రోధం తక్కువ ఉన్న దగ్గర మానం ఎక్కువ

ఒక మహారాజు చెప్పారు, 'నేను క్రోధాన్ని అణిచి-అణిచి నిర్మూలించాను'. నేను చెప్పాను, "దాని పరిణామ స్వరూపంలో ఈ 'మానం' పేరుగల ఎద్దు ఎక్కువ బలంగా మారింది." మానం బలంగా మారుతుంది, ఎందుకంటే మాయ యొక్క ఈ పుత్రుడు అంత సులభంగా చావదు. ఉపాయము చేస్తేనే వెళ్తుంది, లేక పోతే ఇది వెళ్లే రకం కాదు. ఇవి మాయ యొక్క సంతానములు. ఆ మానం పేరుగల ఎద్దు ఎంత బలంగా మారిందంటే, 'నేను క్రోధాన్ని అణిచి వేసాను, నేను క్రోధాన్ని అణిచి వేసాను' అని అంటూ ఇంకా బలం అవుతున్నాయి. దీనికి బదులుగా నాలుగు సమంగా ఉండేవి, అది బాగానే ఉండేది.

## రక్షకులు! క్రోధం మరియు మాయ

క్రోధం మరియు మాయ రక్షకులు. ఇవి లోభం మరియు మానం యొక్క రక్షకులు. లోభం యొక్క నిజమైన రక్షకుడు మాయ, మరియు మానం యొక్క నిజమైన రక్షకుడు క్రోధం. అయినా సరే మానం కోసం మళ్ళీ మాయ కొంచెం వాడుతారు, కపటం చేస్తారు. కపటం చేసైనా మానం పొందుతారు, ఇలా చేస్తూ ఉంటారా ప్రజలు?

మరియు క్రోధం చేసి లోభం చేసేస్తారు. లోభి క్రోధితుడు అవ్వడు, అయినా సరే అతను క్రోధం చేస్తే, అతనికి లోభం చేయడంలో ఏదో అడ్డంకి వచ్చిందని తెలుసుకోండి. అందుకే అతను క్రోధం చేస్తున్నాడు. లేక పోతే లోభిని ఎవరైనా తిడుతూ ఉంటే, ఏమంటాడంటే, 'నాకు నా పైసలు వచ్చాయి, అతను ఎంత అరిచినా నాకేంటి!'. లోభి ఇలా ఉంటాడు, ఎందుకంటే కపటం అన్ని విధాలుగా రక్షిస్తుంది కదా. కపటం అంటే మాయ మరియు క్రోధం. ఇవన్నీ రక్షకులు.

ఎప్పుడైతే తన మానం పై దెబ్బ తగులుతుందో, అప్పుడు క్రోధం చేస్తాడు. తన మానం భంగమైనప్పుడు.

క్రోధం అమాయకుడు. అన్నిటికన్నా ముందు అమాయకుల నాశనం జరుగుతుంది. క్రోధం ఒక మందుగుండు సామాగ్రి. అది ఉన్నప్పుడు పోరాడడానికి సైన్యం తయారుగా ఉంటుంది. క్రోధం నాశనమవుతే ఇక సైన్యం ఎందుకు పోరాడుతుంది? అప్పుడు అన్నీ పారిపోతాయి. ఇక ఏమి నిలువదు.

## క్రోధం యొక్క స్వరూపం!

క్రోధం, అది ఉగ్ర పరమాణు (పదార్థం యొక్క అతి చిన్న కణం). బాణసంచాలో గన్‌పౌడర్ నింపబడి ఉంటే, అది పేలినప్పుడు జ్వాల మొదలవుతుంది. ఆ తరవాత గన్ పొడి మొత్తం వాడబడిన తరవాత, పటాకులు స్వయంచాలకంగా చల్లారుతాయి. క్రోధం కూడా ఇలాంటిదే. క్రోధం, ఉగ్ర పరమాణువు. మరియు అవి ఎప్పుడైతే 'వ్యవస్తిత్' యొక్క నియమ

అనుసారంగా పేలుతాయో, అప్పుడు అన్ని వైపుల నుండి కాలుతుంది. మేము ఉగ్రతను క్రోధం అనలేదు. ఏ క్రోధంలో ఐతే తంతం ఉంటుందో, దానినే క్రోధం అంటారు. క్రోధం అని ఎప్పుడంటారంటే, లోపల దహనం ఉన్నప్పుడు. లోపల దహనం ఉన్నప్పుడు జ్వాల మండుతూ ఉంటుంది మరియు వేరే వారి దగ్గరికి కూడా దీని ప్రభావం చేరుకుంటుంది. ఇది కనిపించే రకమైన క్రోధం (కఢాపా). కాని అజాంపో (కనిపించని రకమైన క్రోధం) లో తనలో తాను మండుతూనే ఉంటాడు. కానీ తంతం మాత్రం రెండిట్లోనూ ఉంటుంది. అయితే, ఉగ్రత, ఇది వేరే విషయం.

## లోలోపలే పొగ, సహించడం, కూడా క్రోధమే

క్రోధంతో కూడిన వాణి బయటకు రాకపోతే ఎదుటివారు గాయ పడరు. మాటలతో చెప్పడం మాత్రమే క్రోధం, అని కాదు. ఒకవేళ లోపల పొగలు వస్తూ ఉంటే, అది కూడా క్రోధమే. దానిని సహించడం అంటే రెండు గుణాల క్రోధము. సహించడమంటే అణిచివేయడము. ఏదో ఒక రోజు స్ప్రింగ్ బౌన్స్ అయినప్పుడు తెలుస్తుంది. ఎందుకు సహించాలి? దీని పరిష్కారం జ్ఞానంతో తీసుకురావాలి.

## క్రోధంలో విపరీతమైన హింస

బుద్ధి ఇమోషనల్ అవుతుంది, జ్ఞానం మోషన్ లో ఉంటుంది. ఉదాహరణకి ట్రైన్ మోషన్లో వెళుతుంది. ఒకవేళ అది ఇమోషనల్ అయిపోతే?

**ప్రశ్నకర్త:** ఆక్సిడెంట్ అవుతుంది

**దాదాశ్రీ:** ఇలా-ఇలా అవుతూ వెళ్తే ఆక్సిడెంట్ అయిపోతుంది. అదే విధంగా మనిషి ఇమోషనల్ అయినప్పుడు ఎన్నో జీవులు లోపల మరణిస్తాయి. క్రోధం జరిగినప్పుడు ఎన్నో చిన్న-చిన్న జీవులు మరణించి అంతమైపోతాయి. కాని ఏమంటారంటే, 'నేను అహింస ధర్మాన్ని పాలిస్తున్నాను, జీవ-హింస ఐతే ఎప్పుడూ చేయను', అర్రే, కాని క్రోధం వలన చాలా జీవులను చంపేస్తారు, ఇమోషనల్ అయ్యి!

## క్రోధాన్ని ఈ విధంగా జయించ వచ్చు

ద్రవ్యం అంటే బయట వ్యవహారము, అది మారదు, కాని భావము మారితే చాలు.

ఎవరైనా క్రోధము ఆపివేయాలి అనుకుంటే, ఈ రోజే ఆగిపోదు. ముందు క్రోధాన్ని గుర్తించాలి, ఈ క్రోధం ఏమిటి? ఎందుకు ఉత్పన్నమవుతుంది? ఇది దేని ఆధారంగా పుడుతుంది? దీని తల్లి ఎవరు? తండ్రి ఎవరు? అన్నీ తెలుసుకున్న తరవాతే క్రోధాన్ని గుర్తించవచ్చు.

## విముక్తి పొందిన వ్యక్తి వేరే వారికి కూడా విముక్తిని కలిగించగలడు

మీరు ఇవన్నీ తీసివేయాలనుకుంటున్నారా? ఏమేమి తీసి వేయాలి, చెప్పండి. లిస్ట్ తయారు చేసి నాకు ఇవ్వండి. అవన్నీ తీసివేస్తాము. మీరు క్రోధం-మానం-మాయ మరియు లోభంతో కట్టబడి ఉన్నారా?

**ప్రశ్నకర్త:** పూర్తిగా.

**దాదాశ్రీ:** మరి కట్టబడి ఉన్న వ్యక్తి తనంతట తాను ఏ విధంగా విడిపించుకో గలడు? అన్ని వైపుల నుండి కాళ్ళు-చేతులు అన్నీ గట్టిగా కట్టేసుంటే తనంతట తాను ఎలా విడిపించుకోగలడు?

**ప్రశ్నకర్త:** అతను ఎవరి సహాయం అయినా తెలుసుకోవాలా?

**దాదాశ్రీ:** కట్టబడి ఉన్న వారి హెల్ప్ తీసుకోవాలా?

**ప్రశ్నకర్త:** స్వతంత్రంగా ఉన్న వారి సహాయం తీసుకోవాలి.

**దాదాశ్రీ:** మేము ఎవరినైనా అడిగితే, 'అర్రే, ఎవరైనా ఉన్నారా, విడుదలయ్యి? స్వతంత్రంగా? ఉంటే, ఇక్కడ మా హెల్ప్ చేయండి'. అంటే, ఎవరైతే స్వతంత్రంగా ఉన్నారో, వారే వేరే వారికి ముక్తినివ్వగలడు. ఇంకెవ్వరు చేయలేరు.

## క్రోధం-మానం-మాయ-లోభం యొక్క ఆహారం !

కొంత మంది జాగృతి గలవారు చెప్తూ ఉంటారు, క్రోధం జరుగుతుంది కాని అది మాకు ఇష్టము లేదు. ఇష్టం లేక పోయినా చేయవలసి వస్తుంది.

మరియు కొంతమంది క్రోధం చేస్తారు, మరియు ఏమంటారంటే, 'క్రోధించక పోతే నా బండి కదలదు, నా బండి ఆగిపోతుంది', ఇలా కూడా చెబుతారు.

క్రోధం-మానం-మాయ-లోభం నిరంతరం తనదే దొంగిలించి తింటుంది కాని ఎవరికీ అర్థం అవ్వడం లేదు. ఈ నాల్గింటిని ఒకవేళ మూడు సంవత్సరాలు ఆకలితో ఉంచితే, అవి పారిపోతాయి. కాని ఏ ఆహారంతో అవి జీవిస్తున్నాయి, ఆ ఆహారము ఏమిటి? అది తెలుసుకోక పోతే, మరి అవి ఏ విధంగా ఆకలితో చనిపోతాయి? దీని అవగాహనా లేక పోవడం వలనే వాటికి ఆహారం లభిస్తుంది. అవి ఏ విధంగా జీవిస్తున్నాయి? అది కూడా, అనాది కాలం నుంచి జీవిస్తున్నాయి! కాబట్టి వాటి ఆహారం ఆపివేయండి. ఇలాంటి ఆలోచన ఎవరికీ రాదు, మరియు అందరు బలవంతంగా వాటిని నిర్మూలించడానికి వాటి వెనక పడి ఉన్నారు. ఆ నాలుగు, మాములుగా వెళ్ళేవి కావు. ఆత్మ, దేహాన్ని విడిచి వెళ్ళేటప్పుడు, అన్నీ ముడుచుకొని వెళ్తాయి. వాటిని హింసాత్మకంగా కొట్టాల్సిన అవసరం లేదు. వాటిని అహింసాత్మకంగా కొట్టాలి.

ఆచార్యుడు తన శిష్యుడ్ని ఎప్పుడు తిడతాడు? ఎప్పుడైతే క్రోధం వస్తుందో, అప్పుడు. అప్పుడు ఎవరైనా, 'మహారాజ్, ఇతన్ని ఎందుకు తిడ్తున్నారు? అని అడిగితే, మహారాజ ఏమంటారంటే, 'అతను తిట్లు పడడానికి యోగ్యుడు' అంతే! అయిపొయింది. ఇలా చెప్పడమే క్రోధము యొక్క ఆహారము. క్రోధం చేసి, దానిని రక్షించడమే దాని ఆహారం.

ఈ క్రోధం-మానం-మాయ-లోభం కి మూడు సంవత్సరాల వరకు ఆహారం దొరకక పోతే, అవి వాటంతటికే పారిపోతాయి. మనం చెప్పే అవసరము లేదు. ఎందుకంటే ఏదైనా సరే, తమ ఆహారము వలనే జీవించి ఉంటాయి, మరియు ప్రపంచంలోని వారు ఏం చేస్తుంటారు? ప్రతి రోజు ఈ క్రోధం-మానం-మాయ-లోభం కి ఆహారం ఇస్తూ ఉంటారు. ప్రతి రోజు భోజనం పెడతారు, అందుకే అవి బలంగా అయ్యి తిరుగుతూ ఉంటాయి.

పిల్లలని చాలా క్రోధితులు అయ్యి కొట్టినప్పుడు భార్య వచ్చి, 'ఈ చిన్న వాడిని ఎందుకు ఇంత కొడుతున్నారు?' అని అడిగితే, ఏమంటారంటే, 'నీకు అర్థం కాదు, ఇతను తన్నులు తినే యోగ్యుడు.' దీనితో క్రోధానికి తెలిసిపోతుంది, 'అర్రే వ్వాహ్, నాకు తిండి పెట్టారు! తప్పు అని అర్ధం చేసుకోకుండా తన్నులు తినే యోగ్యుడు అనే అభిప్రాయం ఇచ్చాడు, కాబట్టి ఇతను నాకు ఆహారం ఇస్తున్నాడు.' దీనినే ఆహారం పెట్టడం అంటారు. మనం క్రోధాన్ని ఎంకరేజ్ (ప్రోత్సహిస్తే) చేస్తే, అది మంచిదనుకుంటే, క్రోధానికి ఆహారం ఇచ్చినట్లే. క్రోధం గురించి ఇలా అనుకుంటే, 'ఈ క్రోధం తప్పు' అని, ఐతే దానికి ఆహారం ఇవ్వలేదు. క్రోధం వైపు ఉంటే, దాని పక్షం తీసుకుంటే, దానికి ఆహారం దొరుకుతుంది. ఆహారము వలనే అది జీవిస్తుంది. ప్రజలు దాని పక్షం తీసుకుంటారు కదా?

మేము క్రోధం-మానం-మాయ మరియు లోభం, దేనినీ రక్షించలేదు. క్రోధం జరిగిన తర్వాత ఎవరైనా, 'ఈ క్రోధం ఎందుకు చేస్తున్నారు?' అని అంటే, నేను, 'ఈ క్రోధం చేయడం చాలా తప్పు, ఇది నా బలహీనత వలన జరిగింది', అని చెప్పేస్తాను. అంటే, మేము రక్షించలేదు, కాని ప్రజలు రక్షిస్తారు.

ఒక సాధు పొగ తాగుతూ ఉన్నప్పుడు నేను అడిగితే, 'సారు, మీరు పొగ తాగుతున్నారు?' అప్పుడు అతను, 'పొగ తాగితే ఏమి కాదు', అని చెప్తే, ఆ అలవాటు ఎక్కువవుతుంది.

ఈ నాలుగు, క్రోధం-మానం-మాయ మరియు లోభం ఉన్నాయి కదా, వీటిలో ఒక దానిపైన ప్రేమ ఎక్కువ ఉంటుంది, రెండోదానిపై దాని కంటే తక్కువ ఉంటుంది. ఈ విధంగా దేని పక్షమైతే ఎక్కువ తీసుకుంటామో, అది ఎక్కువ ప్రియమైనది.

## స్థూల కర్మ : సూక్ష్మ కర్మ

స్థూల కర్మకి అర్థమేమిటో తెలుసుకోండి. మీకు ఒక్క సారిగా క్రోధం వస్తే, మీరు క్రోధం చేయాలనుకోరు కాని క్రోధం జరిగిపోతుంది, ఇలా జరుగుతుందా, లేదా?

**ప్రశ్నకర్త:** జరుగుతుంది.

**దాదాశ్రీ:** అలా వచ్చే క్రోధానికి ఫలం వెంటనే ఇక్కడే అనుభవిస్తారు. అందరు ఏమంటారంటే, 'అతనిని పోనివ్వండి, అతను క్రోధి స్వభావం గలవాడు'. ఎవరైనా వచ్చి అతనిని చెంపదబ్బ వేసి కూడా వెళతారు. అంటే, క్రోధం జరగడం స్థూల కర్మ. మరియు క్రోధం జరిగిన దాని వెనకాల ఇప్పుడు నీ భావం ఏమిటి, 'క్రోధం చేయడమే మంచిది', అని ఉంటే, అది మళ్ళీ, వచ్చే జన్మలో క్రోధం ఖాతా అయ్యి వస్తుంది. నీకు ఇప్పుడు, 'క్రోధం చేయ కూడదు' అనే భావం ఉంటే, నీ మనసులో నిశ్చయించుకుంటే, క్రోధం చేయ కూడదని, అయినా సరే జరిగిపోతే, వచ్చే జన్మలో నిన్ను అది బంధించదు. స్థూల కర్మలో, నీ ద్వారా క్రోధం జరిగితే, దానికి శిక్ష ఇక్కడే, ఈ జన్మలోనే అనుభవించ వలసి వస్తుంది. కాని నీకు వచ్చే జన్మ కోసం కొత్త ఖాతాగా మారదు, ఎందుకంటే సూక్ష్మ కర్మలో నీ నిశ్చయం ఏమిటంటే క్రోధం చేయ కూడదు, అని. కాని ఇప్పుడు ఒక వ్యక్తి ఎవరిపైనా కూడా క్రోధం చేయడు, కాని మనసులో అనుకుంటాడు, 'వీళ్ళు ఎలాంటి వారంటే, వీరిపై క్రోధం చేస్తేనే వీరు సరిగ్గా ఉంటారు.' ఐతే దీని వలన వచ్చే జన్మలో మళ్ళీ అతను క్రోధితుడు అవుతాడు! అంటే, బయట జరిగే క్రోధం, అది స్థూల కర్మ. మరియు ఆ సమయంలో లోపల కలిగే భావము, అది సూక్ష్మ కర్మ. మనం ఇది అర్థం చేసుకుంటే, స్థూల కర్మతో ఏమీ బంధించబడము. కాబట్టి నేను ఈ కొత్త రకమైన 'సైన్స్' (విజ్ఞానము) ఇచ్చాను. ఇప్పటి వరకు 'స్థూల కర్మ వల్ల బంధము' అని ప్రజల మెదడులో నింపేశారు మరియు దీని కారణంగా ప్రజలు భయపడుతూ ఉంటారు.

## క్రోధం-మానం-మాయ-లోభం భేద జ్ఞానము ద్వారా కరిగిపోతాయి

**ప్రశ్నకర్త:** క్రోధం-మానం-మాయ-లోభం, వీటిని జయించడానికి ఏవైనా ప్రాథమిక సన్నాహాలు చేయడం అవసరమా? అవసరమైతే దాని కోసం ఏమీ చేయాలి?

**దాదాశ్రీ:** ఏంటంటే, ఈ క్రోధం-మానం-మాయ-లోభం, నాలుగు వెళ్ళిపోతే, అతను భగవంతుడు అయినట్టే అనుకోండి!

భగవంతుడు ఏమన్నారంటే, 'నీ క్రోధం ఎలా అంటే, నీ సొంత మామయ్య మీద క్రోధం చేస్తావు, అప్పుడు ఆయన మనసు నీ నుంచి వేరు అయిపోతుంది, పూర్తి జీవితానికే వేరు అయిపోతుంది, కాబట్టి నీ క్రోధం తప్పు.' ఏ క్రోధమైతే ఎదుటి వారి మనసుని ఒకటి లేదా

రెండు సంవత్సరాల కోసం వేరు చేసి, తరవాత మళ్ళీ ఒకటి చేస్తుందో, దానిని 'అప్రత్యాఖ్యాని' క్రోధం అంటారు. ఏదైతే మనసుని బ్రేకుడౌన్ చేస్తుందో, అది చివరి తరగతి యూజ్ లెస్ క్రోధము అంటారు, దానిని 'అనంతానుబంధి' క్రోధం అంటారు. లోభము కూడా ఇంతే, తరవాత మానం, ఇవన్నీ ఎంత బలంగా ఉంటాయంటే, అవి వెళ్లిపోయిన తరవాతే మళ్ళీ మనిషి సరి అయిన దారికి వస్తాడు. మరియు 'గుణస్థానకాలు' పొందుతాడు. లేక పోతే గుణస్థానకములోకి కూడా రాలేక పోతాడు. క్రోధం-మానం-మాయ-లోభం, ఈ నాలుగు అనంతానుబంధి కాషాయాలు వెళ్ళిపోయినా, చాలా సాధించినట్టే.

ఇప్పుడు 'జిన్' యొక్క మాట వింటే, ఇవి వెళ్లిపోతాయి. 'జిన్' అంటే ఆత్మజ్ఞాని. వారు ఏ ధర్మానికి చెందిన ఆత్మా జ్ఞాని అయినా, వేదాంతం అయినా, జైన్ అయినా, కాని ఆత్మజ్ఞాని అయి ఉండాలి. ఆయన మాటలు వింటే, అతను శ్రవకుడు అయిపోతాడు. మరియు శ్రవకుడు అయితే, అతని అనంతానుబంధి కాషాయాలు వెళ్లిపోతాయి. తరవాత స్వంతంగా కర్మ వినాశనం అవుతూ ఉంటుంది.

ఇప్పుడు రెండో ఉపాయం ఏమిటంటే, మేము వారికి భేద జ్ఞానము ఇచ్చినప్పుడు క్రోధం-మానం-మాయ-లోభం, అన్నీ వెళ్లిపోతాయి, నాశనమయిపోతాయి. ఇది ఈ కాలము లోని ఆశ్చర్యము. అందుకే 'అక్రమ్ విజ్ఞాన్' అంటారు కదా!

**- జై సత్ చిత్ ఆనంద్**

# శుద్ధాత్మకి ప్రార్థన

హే అంతర్యామీ పరమాత్మా! నీవు నాలో ఉన్నవిధంగానే జీవులందరిలో విరాజమానమై వున్నావు. నీ యొక్క దివ్య స్వరూపమే నా నిజ స్వరూపము. నా నిజ స్వరూపము పవిత్ర ఆత్మ.

హే శుద్ధాత్మ భగవాన్! నేను నీకు అభేదభావముతో అత్యంతభక్తి పూర్వకంగా నమస్కరించుచున్నాను.

అజ్ఞానవశాత్తు నేను చేసిన తప్పులనన్నింటిని ❖ నీ ముందు ఒప్పుకొనుచున్నాను. నేను ఈ తప్పులకు పశ్చాత్తాపం చెందుతూ నీ క్షమకై అర్థిస్తున్నాను. ప్రభూ! దయతో నన్ను క్షమించు, నన్ను క్షమించు, నన్ను క్షమించు. ఆ తప్పులను మరల చేయకుండునట్లు నాకు శక్తిని ప్రసాదించు.

హే శుద్ధాత్మ భగవాన్! మాకు నీతోగల భేద భావము తొలగిపోయి మేమందరము నీతో అభేదతను పొందునట్లు ఆశీర్వదించు. మేము సదా నీతో అభేదతతో తన్మయాకారతను చెందెదము గాక!

(❖ గతంలో నీవు చేసిన తప్పులను గుర్తు తెచ్చుకోవాలి)

# ప్రతిక్రమణ : దివ్యమైన క్షమాపణా విధానము

నేను దాదా భగవాన్ సాక్షిగా ❖...................... యొక్క మనోవచన కాయము కంటె పూర్తిగా వేరైన పవిత్రాత్మకు నమస్కరించుచున్నాను.

నేను నా తప్పులను జ్ఞప్తికి తెచ్చుకొన్నాను (ఆలోచన) ❖❖

ఆ తప్పులకై నేను క్షమాపణ కోరుచున్నాను (ప్రతిక్రమణ)

ఆ తప్పులను మరల చేయనని దృఢముగా నిశ్చయించుకొనుచున్నాను (ప్రత్యాఖ్యాన్)

ప్రియాతి ప్రియమైన దాదాభగవాన్! ఈ దృఢ నిశ్చయమును పాలించు శక్తిని నాకు అనుగ్రహించు.

❖ మీ వలన గాయపడిన వ్యక్తి పేరు

❖❖ ఆ వ్యక్తిపట్ల మీరు ఒనర్చిన దోషాలను గుర్తుచేసుకోవాలి.

## తెలుగులో దాదా భగవాన్ పుస్తకాలు

| | | | |
|---|---|---|---|
| 1. | అన్ని చోట్లా సర్దుబాటు | 6. | చింత |
| 2. | విభేదాలను తొలగించడానికి | 7. | నేను ఎవరు? |
| 3. | ఎలాగైనా జస్టిస్ జరిగింది | 8. | భావనతో మెరుగుపడతాయి జన్మ-జన్మలు |
| 4. | బాధితుడు తప్పిదము | 9. | మృత్యు సమయం దానికి ముందు, దాని తర్వాత... |
| 5. | క్రోధం | | |

❖ తెలుగులో మరిన్ని పుస్తకాలు జోడించబడుతున్నాయి మరియు త్వరలో అందుబాటులోకి వస్తాయి.

## Books of Dada Bhagwan in English

| | | | |
|---|---|---|---|
| 1. | Adjust Everywhere | 19. | Money |
| 2. | Ahimsa: Non-Violence | 20. | Noble Use of Money |
| 3. | Anger | 21. | Pratikraman |
| 4. | Aptavani-1 | 22. | Pure Love |
| 5. | Aptavani-2 | 23. | Right Understanding to Help Others |
| 6. | Aptavani-4 | 24. | Science of Karma |
| 7. | Aptavani-5 | 25. | Science of Speech |
| 8. | Aptavani-6 | 26. | Shree Simandhar Swami : The Current Living Tirthankar |
| 9. | Aptavani-8 | 27. | Simple & Effective Science of Self-Realization |
| 10. | Aptavani-9 | 28. | The Essence Of All Religion |
| 11. | Autobiography of Gnani Purush A.M Patel | 29. | The Fault Is Of The Sufferer |
| 12. | Avoid Clashes | 30. | The Guru and The Disciple |
| 13. | Brahmacharya: Celibacy Attained with Understanding | 31. | The Hidden Meaning Of |
| 14. | Death: Before, During & After… | 32. | The Practice Of Humanity |
| 15. | Flawless Vision | 33. | Trimantra |
| 16. | Generation Gap | 34. | Whatever Happened is Justice |
| 17. | Harmony in Marriage | 35. | Who Am I? |
| 18. | Life Without Conflict | 36. | Worries |

❖ Dada Bhagwan books are available in different languages: Gujarati, Hindi, English, Marathi, Telugu, Kannada, Oriya, Malayalam, Bengali, Punjabi, Assamese, Tamil, German, Spanish, Russian, etc.

❖ 'Dadavani' Magazine is published every month in three languages: Gujarati, Hindi & English.

## దాదా భగవాన్ ఫౌండేషన్ తెలుగు యూట్యూబ్ ఛానల్




❖ ఇది అడాలజ్ దాదా భగవాన్ ఫౌండేషన్ యొక్క అధికారిక తెలుగు యూట్యూబ్ ఛానెల్.

❖ దిగువ లింక్ నుండి తెలుగు భాషలో సత్సంగ వీడియోలను చూడండి.

**‘Dada Bhagwan Foundation Telugu’ Channel:**

https://dbf.adalaj.org/yttelugu

*Open Link OR*

*Scan QR*




---

*Dada Bhagwan Foundation Youtube video channels are available in other regional languages: Gujarati, Hindi, Marathi, Bengali, Tamil, Telugu, Kannada, Malayalam, Spanish, Portuguese, etc.*

# Persons to Contact

## Dada Bhagwan Foundation

**Adalaj** : **Trimandir**, Simandhar City, Ahmedabad-Kalol Highway
P/O: Adalaj, Dist. Gandhinagar - 382421, Gujarat, India.
Tel: +91-9328661166 / 9328661177
E-mail : info@dadabhagwan.org

**Mumbai** : **Trimandir**, Rushivan, Kajupada, Borivali (E)
Tel: +91-9323528901

| | | | |
|---|---|---|---|
| **Kolkata:** | 9830093230 | **Delhi:** | 9810098564 |
| **Jaipur:** | 9351408285 | **Chennai:** | 7200740000 |
| **Bhopal:** | 9425024405 | **Patna:** | 7352723132 |
| **Indore:** | 9039936173 | **Amravati:** | 9422915064 |
| **Raipur:** | 9329644433 | **Bangalore:** | 9590979099 |
| **Chandigarh:** | 9780732237 | **Hyderabad:** | 9989877786 |
| **Kanpur:** | 9452525981 | **Pune:** | 9422660497 |
| **Bhubaneswar:** | 8763073111 | **Jalandhar**: | 9814063043 |
| **Varanasi:** | 9795228541 | **Sangli:** | 9423870798 |

| | |
|---|---|
| **USA: Dada Bhagwan Vignan Institute**<br>Tel: + 1-877-505-DADA (3232)<br>Email: info@us.dadabhagwan.org | **U.K: Dada Darshan (UK)**<br>Tel: +44 330-111-DADA (3232)<br>Email: info@uk.dadabhagwan.org |
| **Germany** : +49 700 32327474<br>**UAE** : +97 1557316937<br>**Kenya** : +25 4722722063<br>**Dubai** : +971 501364530 | **Australia** : +61 421127947<br>**Singapore** : +65 81129229<br>**New Zealand** : +64 210376434 |

Website : www.dadabhagwan.org



## క్రోధానికి బదులు 'శీలం' యొక్క తాపం అధికము

ఈ క్రోధం-మానం-మాయ-లోభం, ఇవన్నీ బలహీనత. బలవంతునికి క్రోధించే అవసరమే ఏమి ఉంది? కాని క్రోధంలో ఏదైతే తాపం ఉందో, ఆ తాపంతో ఎదుటివారిని తమ వశంలోకి తెచ్చుకోవడానికి ప్రయత్నిస్తారు. కానీ క్రోధం లేని వారిలో ఎదో ఉంటుంది కదా, అవునా? అతనికి 'శీలం' అనే చారిత్రం ఉంటుంది, దానితో జంతువులు కూడా అతనికి లొంగిపోతాయి. పులి, సింహం, శత్రువులు, మరియు మొత్తం సైన్యమంతా అతనికి లొంగిపోతుంది.

-దాదాశ్రీ



dadabhagwan.org




Printed in India

Price ₹30